బెజవాడ

రాధాకృష్ణ అండు కో., ముద్రాక్షరశాలలో

ముద్రింపఁబడినది.

# పీఠిక

ఇరువదియైదు సంవత్సరములనాఁడు పట్టాభిషిక్తుఁడైన జార్జి సార్వభౌముని జీవిత మాంధ్రములో నింత వఱకు లేకుండుట విషాదకరము.

రాజుల చరిత్రములు జాతికుత్తేజనము కల్గించును. హిందూదేశపుఁ బ్రాచీన చరిత్రపుఁబుటలు తిరుగ వేసినచో మనకుఁ గన్పట్టునవి విశేషముగా రాజుల చరితము లేకదా?. రాజులచరితములు బాలురకు హృదయంగమములుగ నుండును. మఱియునందు మంచివారి చరితము లాదర్శములుగాఁగూడ నుండును.

అందుచే, జార్జి సార్వభౌముని చరితమును దెలుఁగు వారి కీయవలయుననియు, దానిని వ్రాయుటకుఁ గావలసిన సాధనములను సమకూర్పుఁడనియు నేను మిత్రులును, శ్రీ రాధాకృష్ణ అండు కంపెనీ యజమానులునగు శ్రీ సూరసనేని హరిపురుషోత్తము గారితోఁ బ్రసంగవశమున మొన్నటి దసరాదినములలో నొకసారి యంటిని. నేను చెప్పుట తడవుగా వారు వానిని సేకరించి దయతో నన్నాహ్వానించిరి. మేమిరువురమును గూడి యీ నా చిరకాలపు నాఁటి కోరికను ముగింపఁ గలిగితిమి.

జార్జిచక్రవర్తి జీవితము బాలుర కాదర్శము. మఱి రమ్యమును. దేశాభిమానము కలిగియుండుట, తప్పుగా భావింపక న్యాయముగాఁ గనఁబడు పనులనుగూడ సంతోషముతో నిర్వహించుట మొదలగు సద్గుణములను భారతీయులమగు మనము శ్రీ వారినిజూచి నేర్చుకొన్నచో మన దేశమభివృద్ధి నందితీరును.

* శ్రీ మేరీరాజ్ఞినుండి కూడ మనము నేర్చుకొన వలసిన విశేషములు పెక్కులు కలవు. ఆమె పరోపకార బుద్ధి, గృహకృత్యముల నిర్వహణము, బిడ్డలను స్వయముగాఁ బెంచుట విద్యార్జనమునందు నిరుపమానమగు శ్రద్ధ మొదలగు నుత్తమ గుణములు హిందూసాధ్వుల కాదర్శములు.

ఈ చిన్న గ్రంథ మాంధ్ర దేశములోని బాలబాలికలుపయోగించుకొని శ్రీ రాజ దంపతులలోని యుత్తమ గుణములను నేర్చుకొందురేని మాశ్రమము సఫలమగును.

బెజవాడ,
5-1-1935.

జంపాల వేంకటనృసింహము,
సూరపనేని హరి పురుషోత్తము.

---

* ఆంగ్ల గ్రంథముల ననుసరించి శ్రీ "మేరీ" రాజ్ఞి గారికి వారి పట్టాభిషేకమునకుఁ బూర్వము "మే" రాకుమారి యని యీగ్రంథమునందుఁ వాడితిమి.

# శ్రీ పంచమ జార్జిచక్రవర్తి జీవితము.

## మొదటి ప్రకరణము.



### జననము : బాల్యము.

1865 వ సంవత్సరము జూను నెల రెండవ తేదీ రాత్రి 1 గం॥ 18 నిముసములవేళ నప్పటికి వేల్సు ప్రభువుగానున్న శ్రీ సప్తమ ఎడ్వర్డు సార్వభౌమునకు ధర్మపత్నియగు నలెగ్జాండ్రా రాణియందు రెండవకుమారుఁడు జనించెను. అతనికి "జార్జి ఫ్రెడరికు అర్నెస్టు ఆల్బర్టు" అని నామకరణముకావించిరి. ఈయనయే నేఁడు మనకుఁ జక్రవర్తియయిన భాగ్యశాలి. ఈ జార్జి రాకుమారునకొక యన్నయుండెను. అతఁడు తమ్మునికంటె సుమారు 17 నెలలు పెద్దవాఁడు. అతనిపేరు "ఆల్బర్టు విక్టరు క్రిస్టియన్ ఎడ్వర్డు". ఇంటిదగ్గఱఁ దల్లిదండ్రులతనిని "విక్టరు" అని పిలుచుచుండెడివారు. పెద్దవాఁడగు విక్టరే సామ్రాజ్యమునకుఁ గర్త.

ఆ రాకుమారుల బాల్యజీవితము చాల నానందకరమైనది. తండ్రి ప్రేమకలవాఁడు. తల్లి వారిని బ్రాణముల కంటె హెచ్చుగాఁ జూచుచుండెను. వారికి "లూయీరా

కుమారి", "విక్టోరియాకుమారి", "మాడ్ రాకుమారి"అను సోదరీమణులు ముగ్గురుకలరు. ఆయన్నదమ్ముల నెంతయో వారు ప్రేమించుచుండెడివారు. సకలములగు నైశ్వర్యములునుగల యా బాలుర బాల్య మానందకరముగా నుండుటలో విశేషములేదుకదా?

ఇప్పటికి బాలురలోఁ బెద్దవానికి 13 వత్సరములును, రెండవ వానికిఁ బన్రెండువత్సరములును వచ్చెను. విక్టోరియా రాజ్ఞివారలనిఁటియందే తగిన మిత్రులతోఁగలిపి విద్యాభ్యాసము చేయింపవలయునని సంకల్పించెను. ఆయమ తనకుమారుఁడును నా బాలుర తండ్రియునగు సప్తమ ఎడ్వర్డు ప్రభువునకుఁ గూడ నట్టి శిక్షణమునే యిప్పించెను. చిన్నతనమునందుఁ గలిగిన యనుభవముల నాతఁడు చక్కగా జ్ఞప్తియుందుంచుకొనెను. బాల్యమునందుఁ దల్లిగారి శిక్షణములో నెచ్చటికిని బోవక యింటియందు విద్య నేర్చుకొనుటతనికిఁ జాలఁ గష్టముగాను, విసుగుగను నుండెడిది. అందుచేఁ జక్రవర్తినియగు తల్లిగారితోఁ జెప్పి యామె యుద్దేశమును మార్చనెంచి "విసుగు కలిగించెడిదియు, మఱియు సంతోష ప్రదముగానిదియు నగు గృహశిక్ష నిష్ప్రయోజనమనియు, స్టీమరులో మంచి గురువుల వెంట సముద్రముమీఁదఁబంపి చదువుట వ్రాయుటలతో పాటు విశాలమగు ప్రపంచానుభవముకూడ వారికి నేర్పుటమంచి"దని యు నెడ్వర్డుప్రభువు తల్లికివిన్నవించెను.

విక్టోరియా చక్రవర్తినికిఁ గుమారుఁడు చెప్పినట్లు మను మలను సముద్రప్రయాణముచేయ నంపుటకిష్టములేదు. ఆమె కుమారుఁడగు నెడ్వర్డుతో నిట్లు చెప్పెను. "మంచి శిక్షకులు దొరకరు. ఓడవాండ్రు వారికి మిత్రుల గుదురు. భవిష్యత్తునఁ జక్రవర్తులుకానున్న యారాకుమారు లతో సాధారణులగు స్టీమరువాండ్రు చెలిమిచేయుదురు. అట్టి చెలిమి భవిష్యజ్జీవితములో బిడ్డలకు నష్టము కలిగించునని నాకుభయము. అందుచే మన యింటిలోఁగాక వెల్లింగ్టను కళాశాలకుఁబంపి విద్య నేర్పింతు"ననెను. కాని, దూరదృష్టిగల యెడ్వర్డుప్రభువు దానికిష్టపడక తల్లితో "పోనిండు! కొంతకాలము చూచి బాగుండనిచో నింటికి రప్పించుద"మనెను. విక్టోరియా చక్రవర్తినికిఁ దృప్తికలుగలేదు. కాని, "డాల్టను" అనునొక పండి తునియందుఁ జక్రవర్తినికి విశ్వాసముకలదు. అతడు చక్రవర్తిని శిక్షణపద్ధతిని, నెడ్వర్డు శిక్షణపద్ధతిని బరిశోధించి కుమారునిపద్ధ తియేమంచిదని నిర్ణయించెను. అంత, విధిలేక విక్టోరియాచక్ర వర్తిని మనుమల సముద్రయానమున కంగీకరించెను.

సామాన్యుల బిడ్డలవలె నోడలమీఁద సరంగులపనిని నేర్చుకొనుటకు రాజకుమారులను బంపుట గొప్పదోషమని యాకాలమునందలి జనులలోఁ జాలమందితలంచిరి. జనులు చక్రవర్తినియగు విక్టోరియారాణితోపాటు కళాశాలయం

దుత్తమ విద్యాశిక్షణమందుటయే మంచిదని భావించిరి. అయినను, నెడ్వర్డుప్రభువు "రాజకుమారుల బిడ్డలుకూడ సాధారణజనముతోఁగలసి మెలసియుండి వారు చేయుచుండు వృత్తులను, నేర్చియున్నచో నిరువురయందును బరస్పర ప్రేమయును, సానుభూతియు హెచ్చి స్నేహభావము పెంపొం దు"నని నమ్మియుండెను. తనకుమారులు "గ్రంథపాఠకులు మాత్రమే!" యనుపేరునందుటతని కిష్టములేదు. వారు, కష్ట పడిపనినేర్చిన "కర్మవీరు"లనిపించుకొనవలయునని, ప్రజలలోని వారుగానుండవలయునని యాతఁడుకోరెను. మఱియతని యుద్దేము చక్కఁగా నెఱవేరెననియు, నతని యాలోచనము దూరదృష్టితోఁ గూడినదనియు జార్జి సార్వభౌముని భవిష్యజ్జీవితము వ్యక్తముచేసినది. పదార్థవిజ్ఞాన, రసాయన, తర్కశాస్త్రాదులందు లోకోత్తర పాండిత్యము నందిన కళాశాలలపండితులు చూఁడఁగోనఁజాలని బ్రిటిషు సామ్రాజ్యములోని యయిదు ఖండములలోని ప్రజల యపార ప్రేమను, సప్తద్వీపములందునుగల తమ ప్రజలను స్వయముగాఁజూచి, మాట్లాడి, యారాజకుమారులు పొందఁగల్గిరి. మఱి, వారి హృదయములను ప్రేమపూరితమగు స్నేహముచే హరించిరి.

---

# రెండవప్రకరణము.



## నౌకాశిక్షణము.

మొదట "బ్రిటానియా"యను నోడయందా సోదరులు రెండేండ్లు శిక్షణమునందిరి. నౌకాశిక్షణము త్వరలో వచ్చునదికాదు. ఎంతయో కాలముపట్టును. కాని, దానిని నేర్చుకొనువారు దేశమునకుఁ జేయు సేవ యమోఘము.

వారు నౌకలో నోడపనినేర్చుకొను సామాన్యులతో పాటు నౌకలను నడపుఁబని నేర్చుకొనిరి. కాని, యారాకుమారులు తదితరులకంటె హెచ్చుగాఁ గష్టపడుచుండిరి. ఏల? యనగా వారితోపాటు కష్టపడి యోడపనియంతయు నేర్చుకొన్న తరువాత నారాజకుమారులు ఫ్రెంచి, జర్మనుభాషలు నేర్చుకొనుటకు, గ్రంథపఠనము చేయుటకుఁ బ్రతిదినము నధికపరిశ్రమ చేయవలసియుండెను.

రాజకుమారులు ప్రాతఃకాలముననే కాలకృత్యములు నిర్వర్తించి యాఱుగంటల పదునైదునిమిషములకే యరగంటసేపు దేహపరిశ్రమచేయుచుండిరి. పిమ్మట వారు ప్రాతఃకాలపు భోజనముచేసి, నౌకావిద్యను గొంతవడి నేర్చి 8గంటల 45 నిమిషములనుండి పండ్రెండుగంటలవఱకు వివిధవిద్యలభ్యసించు

చుండెడివారు. పిమ్మట సముద్రతీరముననొక గంట కడపి విశ్రాంతిగైకొని మధ్యాహ్నము రెండుగంటలకు మఱల విద్యాభ్యాసము నారంభించి, సాయంకాలము నాల్గుగంటల వఱకు చదువునేర్చుకొని, నాల్గుగంటలనుండి యాఱుగంటల వఱకు ఆటలతోఁ గాలము పుచ్చుచుండెడివారు.

వారి భోజనము పుష్టికరమైనది. కాని, యది పెక్కురకముల వంటకములు లేక సాధారణముగానుండెడిది. వారు వివిధములగు వెలపొడవు వస్తువులలోఁగాక, రమ్యము లును, ప్రశస్తములునగు పాత్రిలలో భుజించుచుండెడివారు. మఱియు వయస్సునకుఁ దగిన శరీరసౌష్ఠవము, పొడవుగలిగి యా యోడలో వారు పెరుగుచుండిరి.

ఈ బ్రిటానియా యోడలోను దరువాత బచ్ఛంటె యోడలోను జార్జిసార్వభౌముఁడు నేర్చుకొన్న విషయము లలో ముఖ్యమైనది వేళతప్పక పనులు కావించుట. నౌకా శిక్షణముపొందు కాలములో నొకనాఁడుకూడ జార్జి రాకుమా రుఁడు వేళతప్పి విద్యకేగలేదు. అట్లే సార్వభౌముఁడు నేఁడు కూడ నేయేసమావేశముల కేయేవేళకుని పోవలయునో యా వేళ కొక నిముసముగాని, సెకండుగాని యతిక్రమింపకపోయి సరిగా నా యా రాజకార్యములను, సొంతకార్యములను, నిర్వహిం చుచుండును. గంటలతరబడి నాలస్యముగాఁ బడికి పోవు

విద్యార్థులీ విషయమును మన సార్వభౌమునుండి గ్రహించి సోమరితనమును విడిచి వేళకు సరిగాఁ బనులను నిర్వహించు కొనుటను నేర్చుకొందురుగాక!

బచ్ఛంటియను పొగయోడపై రాకుమారులు క్రీ. శ. 1879 వ సంవత్సరము సెప్టెంబరు నెల 17 వ తేదీని బ్రయాణమైరి. బచ్ఛంటి మంచియోడ. దానిలో నోడల ధ్వంసము చేయు ఫిరంగులుకూడఁగలవు. బాల్యమున కనుగుణమగు కుతూహలముతో నాకసమునందలియు, సముద్రములందలియు విశేషములనుజూచుచు నారాకుమారులు బచ్ఛంటి నధిష్ఠించి ప్రయాణము చేయుచుండిరి.

ఆ యోడపైనివారు క్రమశిక్షణమునందుచుండిరి. సంవత్సరములో నన్ని కాలములందును వారు తక్కినవారితో పాటోడవిద్యను శరీరకష్టమునకోర్చి నేర్చుకొనుచుండిరి. ఫిరంగులు విడచుటను, నౌకా సైన్యవిద్య నెఱిగినవేత్త నేర్పఁగానే నౌకాశాస్త్రమునకు సంబంధించిన తదితర పాఠములను వారికి నౌకా శాస్త్రోపాధ్యాయుఁడు నేర్పుచుండెను.

తొలుత, వారు జిబ్రాల్టరునకు వెళ్లిరి. అక్కడి వృక్షముల సొంపు వారి కానందదాయకముగా నుండెను. తరువాత "కానరీ"లనుద్వీపముల కేగిరి. పిమ్మటఁ బశ్చిమసముద్రములోఁ బ్రయాణము చేసిచేసి వారు పశ్చిమ యిండియా ద్వీపముల కేగిరి.

వారియోడపై విద్యుద్దీపములు వెలుఁగుచుండెను. కాని, వానిని వెలిగించు యంత్ర మభివృద్ధినందిన నేఁటి రమ్యములగు చిన్నయంత్రములవలె నిద్దఱు ముగ్గురు మనుజు లెత్తఁ దగినదికాదు. అది పండ్రెండుగురు మనుష్యు లెత్తఁ దగినదియైయుండెను. దాని నింగ్లాండునుండి చక్రవర్తినియగు విక్టోరియా మహారాజ్ఞిగారు తమ మనుమల కొఱకుఁబంపిరి. తేలికయంత్రము వచ్చుననితలఁచిన నావికుఁడు దానిని జూచి చాల నిరుత్సాహముచెందెను.

నవంబరునెల 20 వ తేదీని బయలుదేఱి శాంతక్రిజ్ ద్వీపముచేరిరి. అక్కడనే నెపోలియను యుద్ధములో శాంత క్రిజు తన చేతిని బోఁగొట్టుకొనెను.

తరువాత బార్బడో ద్వీపములుచేరిరి. అందు తెల్ల వారు పదుగురు నీగ్రోల కొక్కరుచొప్పున నివసించు చుండిరి. వారానందముతో రాకుమారులకుఁ బెక్కువిందులు చేసి, క్రికెటాటలు, డాన్సులు మొదలగునవి వినోదముగా జరిపి మర్యాదచేసిరి. పండుగలుచేసిరి. రాకుమారులకుఁ గాలము మహదానందముగాఁగడచెను. ఈదీవులువచ్చువఱకు రాకుమారులు చెఱకుగడల నెప్పుడునుజూచి యుండలేదు. అందుచేవారు సంతసముతోఁ జెఱకుగడలరసము త్రావిరి. మఱియు లేఁతకొబ్బరికాయలలో నప్పుడే కూడుకొనుచున్న

లేఁతకొబ్బరిని వారు చాల నానందముతో భుజించిరి. అది వారికి చాల రుచిగానుండెను.

తరువాత నా రాకుమారులు ట్రినిడాడున కేగిరి. అందు స్పెయిను, ఫ్రాంసు దేశస్థులుండిరి. కాని వారు భావములం దాంగ్లేయులైరి. ఆద్వీపవాసులు - నల్లవారును దెల్లవారును గూడ - నా రాకుమారులకు భక్తితో స్వాగతమిచ్చిరి.

పిమ్మట 1879 వ సంవత్సరము డిసెంబరు 21 వ తేదీకి దక్షిణఅమెరికాకుఁ జేరి మఱుసటి సంవత్సరము జనవరి మొదటిరోజున క్రిస్టమసు పండుగనాఁడు మాంటివిడియా దగ్గఱవిడిసిరి. ఆయూరఁ గ్రిస్టమసుపండుగంత మనోహరముగా జరుగలేదు. కాని, బఛంటె యోడమీఁద రాకుమారులుచాల బాగుగనే యాపండువు జరిపిరి. ఆయోడలోని వారికెల్లరకు నూతన సంవత్సరపు టాశీర్వాదముల కార్డులను దాము దస్కతులుచేసి పంపిరి. పిల్లలకు బహుమతులిచ్చిరి.

# మూఁడవ ప్రకరణము.



## కష్టములు.

తరువాత, దక్షిణాఫ్రికాకుఁ జేరి యక్కడనుండి యా స్ట్రేలియాకు బయలుదేరిరి. ఈ ప్రయాణములో రాజకుమారులనుభవింపవలసినన్ని కష్టము లనుభవించిరి. దక్షిణాఫ్రికాలోని "కేపుటవును"అను పట్టణమునుండి ఆస్ట్రేలియాలోని మెల్బోరనునకు రమారమి యాఱువేల మైళ్లదూరముకలదు.

వారు హిందూ మహాసముద్రము మీఁదుగాఁ బ్రయాణముచేయవలయును. వానిరెంటిమధ్యను గలదారి యొడుదుడుకులుకలది. దక్షిణ హిందూమహాసముద్రయానము ప్రమాదకరముగానుండును. అందుచే వారితర యోడలతోఁగలిసి ప్రయాణముచేయ నెంచిరి. కాని, యా రాకుమారుల యోడ చాల నెమ్మదిగా నడచునది!. అందుచేఁ దక్కిన యన్ని యోడలును ముందుగా వెళ్లిపోయినవి. వెనుకమిగిలినది యొక్క రాకుమారుల యోడయే. తక్కిన యోడలవారు తమను గలిసికొనుటకీ యోడ కవకాశమీయ నెంచి తమయోడలను జాల నెమ్మదిగానడపిరి. అయినను, బచ్ఛంటి వానిని గలిసికొనఁజాలకపోయెను.

ముందుపోయిన యోడలవారు రాకుమారులతో సహా బచ్ఛంటి యోకను హిందూ మహాసముద్రి మగాధమగు తన

గర్భమునందు ముంచివేసెనని భావించిరి. వారి భయమున కనుగుణముగా వారు చేరిన పెక్కుదినములవఱకు రాకుమారుల యోడ వచ్చుచున్న జాడయే కనఁబడ లేదు. అందుచే వారు మఱింతభయపడి నిజముగనే బఘంటియోడ మునిగెనని నిశ్చయించుకొనుచుండిరి.

వారట్లు మెల్లగాఁ బ్రయాణము చేయుచుండ నొకరాత్రి తుపాను వచ్చెను. ఆ రాత్రి యంతయు సముద్రముభీకరముగాఁ బొంగిపోవుచుండెను. తుపాను క్రమక్రమముగా హెచ్చుచు నోడను సముద్రగర్భమునందు ముంచివేయఁ బ్రయత్నించుచున్నదోయన భయంకరముగా నుండెను. ఆవిధిలో నడుపవలయునన్న నదియులేదు. ఏకోలఁ దిగనో యున్నను నది యోడను నడుపుటకుఁ జాలినంతలేదు. పోనిండు! బొగ్గువేసి తగినంత యావిరి నుత్పత్తిచేయుదమన్నను బ్రహ్మాండమగు నాతుపానులో నాయోడమీఁద నొకచోటు నుండి వేఱొకచోటునకుఁ గదలవీలులేదు. దేనినో యొకవస్తువును గట్టిగాఁబట్టుకొనక యెవ్వరును నడచుటకు వీలులేకుండెను. రాజకుమారులుకూడ తడిసిపోయిన యోడ చట్టమును బట్టుకొనియే నడచుచుండిరి. అంతకంటెను దారిలేదు. దేనినైనను బట్టుకొనకయే యోడమీఁద నడచువారు గాలి దూఁకుడుచేఁ గొట్టుకొనిపోవుచుండిరి. 18 సంవత్సరములు

నిండని యా బాలురానాటి రేయి సముద్రగర్భమున నోడయా వత్తు జనముతోడను—బహుశః రక్షణముకొఱకుంచిన చిన్న పడవలతోఁగూడ—నా గొప్పతుపానుచే సముద్రములో ముంచివేయఁబడుట పరమేశ్వరుని సంకల్పమే మోయని భావించుచు నాబఛంటిలోని వారెల్లరు నీశ్వరుని ధ్యానము జేయుచుఁ దెల్లవారువఱకుఁ గంటికిఁ గూరుకులేక మేల్కొని యుండిరి. ఆ యోడలోని వారొక్కరును నాటిరాత్రి నిద్రింపలేదు.

ఆపదలలో నాపదలువచ్చును. అట్టి సమయములోనే వారియోడఁ జుక్కాని చెడిపోయెను. అందుచేనోడను నడపుటకుఁ జుక్కానికి సాధ్యముకాకపోయెను.

ఇంతలో దైవవశమునఁ దెల్లవారుచుండెను. ఆకసమునఁ బరువిడుచు నడపదడపఁ జంద్రునిగ్రమ్ముచున్న మేఘపరంపరలు క్రమక్రమముగా విడిపోవుచుండెను. ప్రొద్దుత్రొట్టిరేకల రాకతోఁ దుపానుపోకయుఁగూడ జరుగుచుండెను. మెల్ల మెల్లగా సముద్రసంక్షోభము తగ్గెను. పెద్ద పెద్ద యలలు క్రమముగాఁదగ్గినవి. ప్రచండముగావీచి వీచి యాయోడలోని వారి నెల్లరను గలవరపఱచిన పెద్దగాడ్పులు తగ్గిపోవఁజొచ్చెను. అగాధమగు హిందూమహాసముద్రమునందు మునిగిపోవుదుమే మోయని భీతిల్లుచున్న యోడలోని జనుల గుండెలు కొట్టుకొనుటయుఁ దగ్గుచుండెను. తగ్గుచున్న

చీఁకటులతోపాటు తుపాను భీకరాకృతియు, దానితోపాటు తరంగముల భయమును దగ్గిపోయెను. తూర్పుదిక్కున నెఱ్ఱని రేఖలు కన్పడఁజొచ్చెను. అప్పటికి సముద్రము చాలవఱకు శాంతమాయెను. వాన తగ్గిపోయెను. ఎల్లర గుండెలును నెమ్మదిపడెను.

అయినను వేఱొకభయముమాత్రము తగ్గలేదు. ఓడ చుక్కాని దారికి రాలేదు. అందుచే నోడ నాస్ట్రేలియావైపునకు మఱల్చుటకు సాధ్యపడకుండెను. అది తన యిచ్చవచ్చినట్లు దక్షిణధ్రువము వైపునకుఁ బోవుచుండెను. అట్టిచోఁ జుక్కానిని సరియగు స్థితికిఁ దెచ్చుట కోడలోని వారెల్లరు విశ్వప్రయత్నమొనర్ప నిశ్చయించిరి. సూర్యుడు కనఁబడఁగనే బాయిలరునందు గొప్పమంట చేయఁబడెను. ఆవిరియు తృప్తియాయెను. పిమ్మట నోడలోని జనము యావచ్ఛక్తిని వినియోగించి యోడచక్రమును సరియగు స్థితిలోనికిఁదెచ్చుటకుఁ బ్రయత్నించిరి. ఎడతెగక సముద్రపునీరు నౌక వెనుకభాగములోనికి వచ్చుచుండెను. ఓడయింకను సరియగు దారికిరాగ దక్షిణధ్రువమువైపునకే పోవుచుండెను. తుపాను తగ్గినను నోడ సముద్రములో మునుగునేమోయనుభయము మాత్రము తగ్గలేదు. దానిని సరియగుదారికిఁ దెచ్చి యాస్ట్రేలియాఖండమువైపునకు మఱల్చుటకు వీలులేకుండెను. ఇట్టి కష్ట

సమయములో నోడలోనివారిమనస్సులలో నెట్టియాందోళన ముండునదియు నట్టిబాధలనుభవించువారికే యెఱుక. రాకుమారులుకూడ నెన్నఁడు నౌకసరియగు దారికివచ్చి బాగుపడునా? యని యాందోళనమందుచుండిరి. కాని, యట్టి మంచిముహూర్తమింకను రాలేదు. తుట్టతుదకెట్లో చుక్కానిని ద్రిప్పు పిడికిని జుక్కానికిని మధ్యనుండు గొలుసును సరిచేసి యొకవిధముగాఁ బాత్రచుక్కానిని బరికభ్యంతరము రాకుండునట్లు చేసి, నౌకలోని శాస్త్రవేత్తలు పెక్కుయత్నములు సలిపి, యప్పటి కుపయోగించునొక చుక్కాని నమర్చి, యాయోడను బెదరిపోయిన గుఱ్ఱమునువలెఁజాలఁ గష్టముమీఁద దారికి తీసికొనివచ్చి, యన్నిటికంటె దగ్గఱలోనున్న యాస్ట్రేలియాలోని సముద్రపు రేవగు నాల్బనివైపున కోడ ద్రిప్పిరి. బ్రహ్మాండమగు తుపానుచేఁ గొట్టఁబడి కొట్టఁబడి శాంతినందిన యచ్చటి హిందూ మహాసముద్రపు జలరాసులవలెనే ఓడలోనివారి మనస్సులును నెమ్మదిం జెందెను.

ఈయోడప్రయాణముంగూర్చి రాజకుమారులిట్లు తమ డయిరీలో వ్రాసికొనిరి. "మేము చాల గొప్పదృశ్యములు చూచితిమి. కాని, యిట్టిదృశ్యములు మాత్రము మఱలచూడఁ గోరము. ఆకసములోఁ జంద్రుఁడు నిండువెన్నెలతోఁ బ్రకాశించుచుండెను. కాని, తుపాను విజృంభించి తఱచుగా నతనిని

మేఘపంక్తులచేఁ గప్పివేయుచుండెను. క్రింద సముద్రము మాటిమాటికి లేచుచున్న యలలనుండి వెల్వడిన ఫేనము చేత ఒక బ్రహ్మాండమగు తెల్లని నురుగుసముద్రమేర్పడెను. ఆనురుఁగుకంటె భిన్నముగా వేఱేమియు మాకుఁ గనఁబడ లేదు."

తుట్టతుదకు వారు రాహువువిడిచిన చంద్రమండలము వలె మహదానందమునందు మునిగి తేలుచు నాల్బనీ పట్టణమునఁగాలుపెట్టి, యా ప్రదేశమునకును, లండనునకును తంతి వార్త యుండుటచే వెంటనే తమ యింటికి క్షేమవార్తను దెలిపిరి.



# నాలుగవ ప్రకరణము.



## ఆస్ట్రేలియాలోని సౌఖ్యములు.

విక్టరు రాకుమారుఁడును, జార్జి రాకుమారుఁడును "ఆల్బని" నగరమునకు ముప్పదిమైళ్లు దూరమునందున్న "యంగు" అనుస్కాటిషు దేశీయుని యాతిథ్యమంది సముద్రబాధలుమఱచిరి. అతని కిరువురు కుమారులు, నిరువురు కొమరితలునుగలరు. అతఁడు తననాల్గువందల యెకరములపొలమునుదున్ని పండించుకొనుచు మఱి నలుబదివేల యెకరముల యడవిని దనపశువులయు, గొఱ్ఱెలయు మేఁతకొఱకాస్ట్రేలియా ప్రభుత్వమువారియొద్ద నద్దెకుఁబుచ్చుకొని భూస్వామియై సుఖముగానుండెను.

ఆస్ట్రేలియా విశాలమగుఖండము. ఆ దేశములో సాధారణముగా నేఁబది యఱువదికోట్లజనులు నివసింపవచ్చును. కాని, యొకకోటిమంది తెల్లవారుమాత్రమే యందు నివసించుచుండిరి. అందుఁ గొందఱొక్కొక్కరు వేలకొలఁది, లక్షలకొలఁది యెకరములభూమిని స్వాధీన ములోనుంచుకొని పాడిపంటలతోను ధనధాన్యములతోను దులతూఁగుచు మనదేశములోని జమీందారులవలె సర్వభాగ్యములును, గలిగి సుఖ

ముగా నివసించుచుండిరి. మన రాజకుమారుల కాతిథ్యమిచ్చిన "యంగు" అట్టివారిలోనొకఁడు.

యంగుగారి యింట వారు చాల నానందముగాఁ గాలముగడపిరి. భోజనములు పొలములోని యింటిలో భుజించి వారు రాత్రులడవిలో నతఁడు నిర్మించిన చిన్న కుటీరమునందు హాయిగా నిద్రించెడివారు. దక్షిణహిందూమహా సముద్రములోని భయంకరములగు సముద్ర ప్రయాణములకు భిన్నముగా నిచ్చటి జీవితము వారికి హృదయంగమమై కన్పట్టెను. వారు గదులలోఁ గాక బహిరంగమగు స్థలమునందే కొయ్యతొట్టిలో నొకరి తర్వాతనొకరు తమ బట్టలు దుకుకొని, స్నానములు చేసి యుదికిన వస్త్రములు ధరించుకొని, పొలములోని యింటికేగి, యందు భుజించుచుండెడివారు. ఆ చక్రవర్తుల బాల్య జీవిత మెంత యాడంబరము లేనిది!. యంగుగారు వారికిఁ గావించు విందులు కూడఁ జాల హృదయంగమములుగా నుండెను. పాలును, వెన్నయు సమృద్ధిగానుండెను. "కంగారూ" జంతువుల మాంసము, కోడిమాంసము, మీఁగడ, మృదువగు రొట్టెలు తృప్తికరముగా వడ్డించుచుండెడివారు. ఇంగ్లాండు విడిచిన తరువాత నా రాకుమారులెక్కడను నిట్టి మధురమగు పాలను, వెన్నను భుజింపలేదు. అట్టి పాలుగాని, వెన్న గాని వారి కాఫ్రికాయందుఁ గాని దక్షిణపు టమెరికాయందుఁగాని దొరకనేలేదు. అందుచే

భోజనమైన తరువాత వారు పాలనుదీసికొనివెళ్లి మంచినీటికి బదులుగా నవి పానీయముగాఁ ద్రావుచుండెడివారు.

రాత్రులందు రాకుమారులా యడవియింట నినుప మంచములపైఁ బరుండెడివారు. తక్కినపరిజనము ముతకరకపుఁ బజ్జపులపై నేలమీఁదఁ బరుండుచుండెడివారు.

అచ్చట నిట్లు రాకుమారులింకను నెంతయో యానందముగాఁ గాలము గడపిరి. అడవికోళ్లు, కంగారూలు, నల్లహంసలు, మొదలగుజంతువులను వారు వేఁటాడుచుండెడివారు. ఆరాకుమారులు వేఁటకు వెళ్లినప్పుడు బలాఢ్యులగు నిరువు రాస్ట్రేలియా పోలీసులు గుఱ్ఱములెక్కి సాయుధులై వారిని వెంబడించుచుండెడివారు.

మే నెల 24 వ తేదీని వారు రాణిగారి జన్మదినోత్సవము జరిపిరి. మఱుసటినాఁడు రాకుమారులు పి. అండు ఓ. స్టీమరు మీఁదఁ బ్రయాణముచేయనిశ్చయింపఁబడెను. అది తెలిసిన యాయోడలోని యుద్యోగియొకఁడు బచ్చంటియోడలోనికి వచ్చెను. అప్పుడు జార్జి రాకుమారుఁడోడ నడపుచుండెను. ఆ పి. అండు ఓ. స్టీమరుద్యోగి యతఁడే రాకుమారుఁడని తెలిసికొనలేరక "రాకుమారులు మా పి. అండు. ఓ. యోడమీఁదఁ బ్రయాణముచేయుట మాకెంతయో పీడ!" యనెను.

అంత వెంటనే దానిని రాకుమారుఁడగు జార్జి యందుకొని "నిజమే! రాకుమారులు మీ యోడమీదఁ బ్రయాణము చేయుట మీకుఁ బీడయే!" యనెను.

పిమ్మట బఘంటి యోడ కెప్టానువచ్చి యా యుద్దతికిని బరిచయముచేసెను. అంతనా "పి. అండు ఓ." యోడ యుద్యోగినొచ్చుకొనుచు నొడుకలచుకొనెను. కాని, జార్జి రాకుమారుఁడు "అయ్యా! మీకుఁగలకష్టములు మీరు చెప్పితిరి. అందేమి తప్పుగలదు?" అని పక పకనవ్వెను. అంత నా యుద్యోగికూడ భయమువిడచి పకపకనవ్వెను. ఉభయులు నవ్వుకొనిరి. చిన్నతనమునందే యంతయోరిమి శ్రీ జార్జి రాకుమారునకుండుట బహుశః రాఁబోవునున్నత పదవిని సూచించునుగాఁబోలు!.

పిమ్మట నామెయిలు నౌకలోవారు "అడిలెయిడు" పురమునకేగిరి. ప్రజలువారికి గొప్పస్వాగతమిచ్చిరి. పురమందిరములో గొప్పసభజరిపి దక్షిణ ఆస్ట్రేలియాప్రజలకు విక్టోరియా రాజ్ఞియందుఁగల భక్తినిదెలిపిరి. ఆస్వాగతమునకు సమాధానముగా వారిలోఁబెద్దవాఁడగు విక్టరిట్లు చెప్పెను. "అయ్యా! మేముదక్షిణాస్ట్రేలియాలోఁ జాలఁగాలఁదికాలమే యుంటిమి. లోఁగడ మీరువిక్టోరియా రాజ్ఞియందు భక్తికల వారనియు నాస్ట్రేలియాలో సిరిసంపత్తులతోఁ దులతూగుచుంటిరనియు వింటిమి. అది నేఁడు కండ్లారఁ గంటిమి." ఆసమాధానము వారికి గొప్ప యానందముకల్గించినది.

పిమ్మట నారాకుమారులు "ఎడిలెయిడు"నకు గుఱ్ఱపు బండ్లమీఁద వెళ్లిరి. ఆప్రయాణము చాలరమ్యదృశ్యములు కలిగి యుండెను. అలెగ్జాండ్రియా సరస్సుచుట్టునుఁగల భూములలో కంగారూమృగములు చాలనష్టము కలిగించుచుండెను. అవి, పశువులు, గొఱ్ఱెలమందలు మేయుటకుంచిన పచ్చికను దామేవచ్చి మేయుచుండెను. ఆసరస్సు ప్రాంతభూములలో నొక్క వత్సరములో నాల్గువేల కంగారూలు చంపఁబడిన వన్నచో నవియెంతహెచ్చుగా నున్నదియు మనముగ్రహింపఁ గలము. మనరాకుమారులా ప్రాంతములలో నానందముగా నామృగములను వేఁటాడిరి.

మఱియు వా రాప్రాంతములంగల యడవిజనుల వింత యాటలుచూచి వినోదముగాఁ గాలముగడపిరి. ఒకయాటలో రెండువందలమంది యడవిజనులు తెల్లనిరంగులుపూసికొని బల్లెములు, నమ్ములుధరించి యుద్ధపుటాటలు, నాట్యములుసలిపిరి.

తరువాత, వారాస్ట్రేలియాలోని మఱికొన్ని ప్రాంతముల కేగిరి. ఇంతలో "బచ్ఛంటి" బాగుపడెను. వారు మూఁడు నెలలనుండి యాస్ట్రేలియాలోఁ జేసిన స్నేహములను విచారముతో వదలవలసివచ్చెను. "ఇంగ్లాండు తరువాత నాస్ట్రేలియా మాహృదయ తలములందెన్నఁటికిని మఱపురాకయుండు"నని మిత్రులతోఁ జెప్పుచు నారాకుమారులు ఫిజీద్వీపమునకు బచ్ఛంటి మీఁదఁ బ్రయాణమై వెళ్లిరి.

# ఐదవ ప్రకరణము.



## "ఆసియా" ఖండ సంచారము.

వారు ఫిజీకి 1881 వ సంవత్సరము సెప్టెంబరు నెల మూఁడవ తేదీని వెళ్లిరి. అచ్చటి ప్రజలించుక యెఱ్ఱగానుండు క్రైస్తవులు. వారి నాయకుఁడగు "తోకంబా" కొరఁగా నా ద్వీపముల నింగ్లీషువారు స్వాధీనముచేసికొనిరి. అతఁడు రాకుమారులకు గొప్పస్వాగతమిచ్చెను. రాకుమారులాఫిజీవాసుల దేహసౌష్ఠవముచూచి యాశ్చర్యమందిరి. వారి దేహముల పటుత్వము, స్థాత్రిము నిరుపమానము. వారి సరాసరి యున్నతి ప్రపంచములోని యన్ని జాతుల సరాసరి యున్నతికంటె హెచ్చుగానుండెను. ఆదేశస్థులా రాకుమారులకుఁ దిమింగిలపుబెము కను బహుమతిచేసిరి. వారియాచారము ననుసరించి యది ప్రపంచములోని యన్నిబహుమతులకంటె గొప్పది.

పిమ్మట వారు జపాను దేశమున కేగిరి. బఘంటిని "యెడో" ఓడరేవునందుంచిరి. ఆరేవుచాల సౌందర్యమైనది. మంచుగడ్డతోఁ గప్పబడిన "ఫుజియాఁమా" కొండలా పట్టణమునకుఁ జాల వన్నె గూర్చుచుండెను.

తమ నౌకాధిపతితోఁ జెప్పి యా రాకుమారులిరువది మైళ్ల దూరములోనున్న జపాను దేశపు ముఖ్యపట్టణమగు టోకియో

చేరిరి. జపాను దేశపుఁ జక్రవర్తి వారికొక గొప్పరాజభవనమునిచ్చి యొక్కచిటికె వేసినచో వెళ్లి వారిని సేవించుటకొఱకు 30 మంది భటులను సిద్ధముగా నుంచెను.

అక్టోబరు 25 వ తేదీని వారు జపానుచక్రవర్తియగు "మికాడో"ను సందర్శించిరి. అప్పటి చక్రవర్తిపేరు ముత్సుహితో. అతనికి ముప్పదియేండ్లయినను లేవు. అతఁడు తన మంత్రులలోనొకని ద్వారా యాయాంగ్లదేశపు రాకుమారులతో మాట్లాడి వారి యోగక్షేమములెఱింగెను.

విక్టరురాకుమారుఁడు రెండుచిన్న "కంగారూ"జంతువులను జపాను చక్రవర్తినికి బహుమతిచేసెను. ఆ దేశములో నాజంతువులు లేవు. అందుచే నాదేశీయులు వానిని ప్రేమించిరి. మఱి యాచక్రవర్తిని, నతని సోదరుని నిగ్లండునకు రండని యారాకుమారు లాహ్వానించిరి.

ఆరాకుమారులా దేశములో మూఁడువారములు గడపి యత్యంత రమ్యములగు పర్వతాటవీ ప్రాంత దృశ్యములను, విలువచెప్పరాని చిత్రవస్తువులు, ప్రాతపవిత్రగంథములు కల దేవాలయములను, బవిత్రములై యత్యున్నతములగు బుద్ధదేవుని విగ్రహములను జూచి యానందించి చీనాదేశమునకుఁ బోయిరి.

వారా దేశములో షాంఘీ, అమాయి, హాంగ్ కాంగు, కాంటనులు మాత్రము చూచిరి.

చీనా దేశములోఁ దిరిగి యీ రాకుమారు లా దేశీయులు పట్టుదలతోఁ బనిచేయువారనియు, సంతోషవంతులనియు శాంతులనియు గ్రహించిరి. అనేకసార్లా రాజకుమారులను జూడవచ్చిన ప్రజలు వారినిగురించి మంచిగను, వెగటుగను గూడ మాట్లాడిరి. కాని, యీ మంచిచెడ్డలను వారు సంతసముతో సహించి "జపానువారు మొదట చాలమంచివారుగా గనఁబడి తుదకు వెగటుగానుందురనియుఁ, జీనావారు మొదట వెగటుగాగనఁబడి తరువాత మంచివారుగా మారుదు" రనియు గ్రహించిరి.

చీనా దేశములో రాకుమారులు రమ్యములగు వేఁటలు సలిపిరి. వారు తుపాకులుగైకొని పొలములలో నడచుచుండఁగాఁ జీనా వ్యవసాయకులు వారి వేసములు, భాష, వినయముచూచి సంతసించుచుండిరి. కాని, విదేశీయులు తమపంటభూములలో నడవరాదను పట్టింపువారికి లేనేలేదు. కెప్తానగు ఫిడ్లరాల్డును, రాకుమారులును, మఱికొందఱును గలిసి యయిదురోజులలో రమారమిః మూఁడువందల మైళ్లు సంచారముచేసి, యీ దేశములోనిపంటలుతిని బలిసిన యడవిపావురములను, మఱికొన్ని జలపక్షులను, భూమిమీఁది పక్షులను, మృగములను విరివిగా వేఁటాడిరి.

తరువాత వారు సింగపూరువచ్చిరి. యింటికి వెళ్లుచుంటిమను నానందము హెచ్చెను. సింగపూరులో బ్రహ్మాండమగు స్వాగతముజరిగెను. సింగపూరునందు ముఖ్యముగా వారికిఁ

గన్పట్టిన విషయమేమియనఁగా: అది ప్రపంచములోని సర్వ జాతుల జనులయు సమష్టికుటుంబముగా నా రాకుమారులకుఁ దోఁచుటయే. అందు మలయావారు, చీనావారు, హిందువులు, సిక్కులు, యూదులు మొదలగు పెక్కుజాతులవారు పరస్పర ప్రేమతో నేవిరోధములును లేక వారి వారికి సహజములగు వింతవింతలగు దుస్తులతో నివసించుచుఁ జూపఱకు వినోదము కూర్చుచుండిరి. అట్లన్నిజాతుల జనులన్నదమ్ములవలె విరోధములు లేకయుండుట వారికిఁ గొప్ప యాశ్చర్యముగాఁ గన్పట్టెను.

సింహాళములోజరిగిన స్వాగతమునకు సింగపూరు స్వాగతము చాల లేదు. ఆంగ్లేయులు, సింహాళద్వీపవాసులు కూడ నొకరికంటె నొకరు హెచ్చుగా వారికి స్వాగతమిచ్చిరి. ఆరాజకుమారులు వెడలువీథులలో లక్షలకొలఁదిగాఁ బ్రజలుచేరి సంతోషము వెలిపుచ్చిరి. కొందఱాంగ్లేయులు వారి బండికిఁ గట్టినగుఱ్ఱములను విప్పి సంతోషముచేఁ దామే యారాజకుమారు లెక్కిన శకటమును లాగిరి.

ఆ రాకుమారులు సింహాళములో జింకలను వేఁటాడిరి. కాఫీతోటలు వీక్షించిరి. మితిలేని విందులతో, టీపార్టీలతోఁ గాలము హాయిగాఁగడపిరి. వారికి రెండువారము లొక్క రెండు నిమిషములవలెఁ గడచెను. ప్రేమమయులగు సింహాళ దేశీయులను వారు విచారముతో విడిచిరి.

# ఆఱవప్రకరణము.



## నౌకా విద్యాపరీక్షలు : ప్రయాణపుముగింపు.

ఈజిప్టుదేశమునకు రాజప్రతినిధియగు "ఖేడివు" వచ్చి కైరోయందా రాకుమారులకు వారి దేశాచారముననుసరించి స్వాగతమిచ్చెను. ఈజిప్టులో వారు సందర్శించిన దృశ్యములలోఁ బ్రపంచములోని యేడాశ్చర్యములలో నొకటియగు "పిరమిడు" దర్శనము ముఖ్యమైనది. వారు 456 అడుగుల యెత్తుగల యాగొప్పపిరమిడు నెవరు నెక్కజాలనంత వేగముతో ననఁగా 15 నిమిషములలో నెక్కిరి. దానినంత త్వరలో నెక్కినవారు నేఁటికిని జాలకొలఁదిమంది మాత్రమేకలరు. అప్పటికి 14 ఏండ్లకుఁ బూర్వము వారితండ్రిగారగు సప్తమఎడ్వర్డు చక్రవర్తిగారా పిరమిడును సందర్శించి యందొకచోటఁ దమ పేరును బొడియక్షరములలో "ఏ. ఇ". అనివ్రాసిరి. దాని క్రిందనే యా రాకుమారులుకూడఁ దమ సంతకములుచేసిరి.

తరువాతఁ బెక్కుస్థలములకేగి మే నెల 21 వ తేదీని "క్రీటు" అను నోడరేవుచేరి యందుఁదమ మధ్యధరాసముద్రపు నౌకాసైన్యములను బరీక్షించిరి. అప్పుడక్కడకు విదేశీయుల యుద్ధనౌకలుకూడ వచ్చియుండెను.

ప్రపంచములోని యనేక దేశములను బట్టణములను వింతలను, విశేషములను దిలకించుచున్న యారాకుమారులా వినోదములమధ్య తమ విద్యావిషయమునం దెంతశ్రద్ధ వహించిరో తెలిసికొన్నచోఁ జాల నాశ్చర్యముగానుండును. ఇంచుమించుగా మధ్యధరాసముద్రపు నౌకాదళమును బరీక్షించు రోజులలోనే వారియు,వారియోడలోని యితరులయు నౌకావిద్యాపరీక్షాదినములువచ్చెను. కాని, ఫలితములు 1883వ సంవత్సరము మార్చి నెలవఱకుఁ దెలియలేదు. ఆరాకుమారులు వివిధ వినోదములు చూచుతరుణములలో నాయోడలో నౌకావిద్యనభ్యసించుచున్న యితర బాలుర కేవిధమగు నష్టము కలుగకుండఁ జూచుచుండిరి. తాముకూడఁ దమవేఁటలు వనప్రయాణములు, రమ్యదృశ్యదర్శనములు ముగిసినపిమ్మట నౌకావిద్యను జాలశ్రద్ధతో నేర్చుకొనుచుండిరి. అందుచే ఫలితములు ప్రకటింపఁబడినప్పుడు తాము నేర్చుకొనుచున్న నౌకావిద్యయందారాకుమారులు తామెంతశ్రద్ధవహించిరో, యితరులకెట్లు నేర్పించిరో తెలిసి ప్రపంచమెల్ల విస్మయమునందిరి. విద్యాధికారులా విషయముంగూర్చి యిట్లు ప్రకటించిరి. "1881 వ సంవత్సరములో మూఁడవదిగానున్న బఛంటియోడ యీసారి నౌకావిద్యను బోధించుటలో మొదటిదైనది. నౌకావిద్యలోఁ బ్రథమశిక్షణములోఁ జేరిన 195 మంది విద్యార్థులలో మొదటి ముగ్గురు బఛంటి యోడలోనివారే. ఆ యోడలో విద్య

నేర్చిన నౌకామధ్యమ శిక్షితులైనమంద్రును బరీక్షలలోఁ గెల్చిన ముప్పదినలుపురలో 'మొదటివారైరి." తలిదండ్రుల ధనమును నెల నెలకు నేఁబదులును, నలువదులును, వృథగా వ్యయము చేయుచు బస్తీలలోఁ దిరుగువిద్యార్థులా రాకుమారుల శ్రద్ధను, విద్యాభిలాషను, బరుల విద్యలకు నష్టమురాకుండఁ బుచ్చుకొను జాగ్రితను గమనించి తాముకూడ వారి మార్గమనుసరింతురు గాక!.

పరీక్షల తొందరలణఁగినతర్వాత వారు పెక్కు స్థలములు సందర్శించి యాగష్టు నాల్గవ తేదీనాఁటికి "డెవను"నకేగిరి. అందుఁ గనులపండువుగానున్న జొన్నచేలను, బచ్చిక బయళ్లను జూచి వారానందించిరి. ఇంగ్లండు నుండి వచ్చిన "ట్రాలరు" అను చేపలుపట్టెడి పడవనుండి కొన్ని చేపలను, వారమునాఁటి యింగ్లీషుపత్రికను వారు కొనిరి. అవియే వారికి బ్రహ్మానందముగా నుండెను.

"స్వానేజి వియుక్తాగ్ర గుడము" దగ్గఱకు వెళ్లునప్పటికిఁ దండ్రియగు నెడ్వర్డు ప్రభువును, దల్లియగు నలగ్జాండ్రా రాణియు, ముప్వురు సోదరీమణులును "అస్బోరను" అను పేరుగల నౌకలోవచ్చి వారికి స్వాగతమిచ్చిరి. తల్లిదండ్రుల గౌరవార్థము వారు "బఛంటి" యోడనుండి యిరువదియొక్క ఫిరంగులనుగాల్చిరి. ఆతల్లిదండ్రులును సుమారు నలువదియైదు

వేల మైళ్ల నిడివిగల సముద్రప్రయాణమును జయప్రదముగా నిర్వహించినందులకు "బచ్ఛంటి" నౌకాధిపతి నభినందించి యిరువురు రాకుమారులను సంతసముతో నాస్బ్యోరను నౌకమీఁదఁ దమ వెంటఁ దీసికొని యింగ్లండులోని తమ యాస్బోరను గృహమునకుఁ బ్రయాణమై వెళ్లిరి.

ఆగష్టు 7వ తేదీని నాప్రయాణమును జయముతో నిర్వహించిన నౌకాధిపతి కెప్టెన్ ఛార్లెసు స్కాటు ప్రభువునకు యువరాజదంపతులు విందుచేసి "సి. బి." అను గౌరవ చిహ్నముచే నతని నలంకరించిరి.

రాకుమారులకు విద్యనేర్పిన గురువులకును దగిన యితరులకును నెడ్వర్డు ప్రభువు మంచి బహుమతులిచ్చెను. తక్కిన యోడలోని యుద్యోగులను, సరంగులు మొదలగు సాధారణులను యువరాజదంపతు లర్హ్మగీతిని గౌరవించిరి.

ఒక్కటే ప్రాణముగా నుండు విక్టరురాకుమారుఁడును, జార్జి రాకుమారుఁడును నాఁటినుండి తమ భిన్నములగు పదవుల కనుగుణములుగాఁ దమ జీవితములు మార్చుకొనిరి. సామ్రాజ్యమునకుఁ జక్రవర్తియగుటకుఁ దగిన శిక్షణమును విక్టరు నేర్చుకొనుచుండెను. అట్లే నౌకాధిపతియగుట కింకను గావలసిన యన్ని శిక్షణములను శ్రద్ధతోఁ దమ్ముఁడగు జార్జి రాకుమారుఁడు నేర్చుకొనుచుండెను.

# ఏడవ ప్రకరణము.



## జార్జిరాకుమారుని మాటలు, చేతలు.

జార్జి రాకుమారుఁడు క్రమక్రమముగా విద్యాభివృద్ధి నంది నావికుల మెప్పునందుచుండెను. ఆతని కోడవిద్యయందు నిజమగు ప్రేమయుండెను. అతఁ డోడవిద్య నేర్చుకొను కాలములో దానినే తనప్రాణముగాఁ దలఁచియుండే నిమగ్నుఁడై యుండెడివాఁడు. ఆతఁడేది యాచరించునో దానినే యితరులకు బోధించు చుండెడివాఁడు. ఆతఁడు "కన్వే" యను నౌకాశిక్షణమునేర్పు నౌకలోని విద్యార్థులకు హితబోధ కావించు నప్పుడిట్లు ప్రసంగించెను:"ఇరువది సంవత్సరములకాలము సముద్రమునందు నౌకావిద్య నభ్యసించిన నేను మీకావిద్యను గూర్చి హితబోధచేయుట కెంతయుఁదగి యుందునని భావించెదను. ఏవిద్యయందుఁగాని యున్నతినందఁగోరువారు మూఁడు చిన్నవిషయములు కలిగియుండవలయును. అవి యేవియనఁగా: మొదటిది సత్యము, రెండవది విధేయత, మూఁడవది శ్రద్ధ. ఈమూఁడునుగలిగిన విద్యార్థి యేవిద్యయందైనను జయమందితీరును. నౌకావిద్య యందట్టివానికి మంచిజయము కలిగితీరును ఏలయనఁగా? సత్యపరత్వము నౌకలో మీక్రిందనుండువారిలో మీయందు విశ్వాసమును

గలిగించి మీమాటలలో నుంచు నట్లుచేయును. విధేయత మీపైనుండువారిలో మీయందు మంచిభావముకల్గించును. మఱిశ్రద్ధయో దానినినేను దుదియందుఁజెప్పినను నది మూఁడింటిలోఁ దక్కువదికాదు. శ్రద్ధలేనివాని కేవిద్యయు రాదు. అందును నౌకావిద్య యసలేరాదు. శ్రద్ధలేని నౌకా విద్యాభ్యాసకుఁడొక గడ్డిపరకకు గూడఁ బనికిరాఁడు." ఈ వాక్యము లాతఁడు కొంత పెద్దవాఁడయిన వెనుక బలికినవి. కాని, యతని విద్యాభ్యాసకాలములో నతఁడందుఁ జెప్పిన ప్రతిచిన్నమాటను నాచరణలో నుంచియేయుండెను. బఛంటె యోడపైఁ బ్రపంచము చుట్టివచ్చినపిమ్మట నతఁడు తననౌకావిద్యను విరమింపలేదు. విరమించినను నతనికి జరుగనిదిలేదు. కావలసినంత యైశ్వర్యముకలదు. ఇంటిదగ్గఱ రాజభోగము లనుభవింపవచ్చును. కాని, యతఁడు శరీర శ్రమకోర్చి పనిచేసి నౌకావిద్యలో నగ్రేసరుఁడు కావలయునని తలంచెను. అందుచే నతఁడు 1886 వ సంవత్సరములో "థండరు" అను నోడపై లెఫ్టినెంటు పదవియందుండెను. తరువాత "డ్రెడ్నాటు" అను నోడపై నదేయుద్యోగములోఁ బనిచేసెను. ఇట్లు బఛంటెని విడిచినతరువాతఁ బదుమూఁడేండ్ల కాలమతఁడు పెక్కు నౌకలలో సాధారణ జనునివలె మంచి శిక్షణము నందెను.

మధ్య ధరాసముద్రములో నతఁడీయోడలోనుండఁగా నొక చిత్రముజరిగెను. దానినిబట్టి మనము జార్జి రాకుమారుని ధర్మనిర్వాహణమును గుర్తింపవచ్చును. "డ్రెడ్నాటు" ఓడ "పోర్టుసెడ్డు"అను సముద్రపు రేవునకువచ్చెననియు నందు రాకుమారుఁడుండెననియు నీజిప్తునకుఁ బ్రభువగు ట్యూఫికు పాషాకుఁ దెలియవచ్చెను. ఆతఁడు వెంటనే రాజకీయ మర్యాదలతోడను, గొప్పయలంకారములతోడను, నీజిప్టు దేశములో గణ్యతగాఁజూడఁబడు మంచిదుస్తులతోడను, బరిజనముతోడనువచ్చి తనరాకను రాకుమారునియోడ కెప్తానునకుఁ దెలియఁజేసెను. అతఁడా యీజిప్టుప్రభువును నతని పరివారమును నుచితరీతి గారవించి యర్హస్థానములందుఁ గూరుచుండ నియోగించెను. ఈజిప్టురాజు కొంతవడి కూరుచుండి చక్రవర్తి సందర్శనము చేయఁగోరెను.

కెప్తానువచ్చి రాకుమారునకీజిప్టు ప్రభువుకోరిక నెఱిఁగింపఁగనే యాతఁడు నిముసమేని యాలస్యముచేయక యా భూపాలుని జూడనేగెను.

కాని, యప్పుడు జార్జిరాకుమారుఁడు కూలివారలచే బొగ్గు మోయించి తెప్పించి యోడలో స్వయముగా దగ్గఱనిలిచి సర్దించుచుండెను. అతఁడాపనిని బ్రత్యేకముగాఁ దనపైనుంచుకొనెను. కావున, నతఁడే యాపనినిముగించు చుండెను. గం

టలతరబడి యాపనినీతఁడు చూచుచుండుటచేఁ గూలివారలు తెచ్చుచున్న బొగ్గులోని నల్లని యణువులు గాలికివచ్చి యత నిపైఁబడి యాతని తెల్లవస్త్రములను సంపూర్తిగా నల్లనివాని నిగాఁ జేసెను. అంతేగాక యవసరమువచ్చినప్పుడెల్లఁ దాను గూడ నాబొగ్గుపని చేయుచుండెను. అందుచే నతని చేతులు ముఖముకూడ బొగ్గురాజు కలిగియుండెను.

స్నానాదులు చేసి క్రొత్తవస్తువులు ధరించి యీజిప్టు ప్రభువునుజూచుటకు వెళ్లినచోఁ జాల నాలస్యమై యతని కసంతృప్తి కలుగునని భావించి జార్జి రాకుమారుడా వేషముతోడనే యా యీజిప్టు ప్రభువును సందర్శింపనేగెను.

"రాకుమారులిట్టి వేషముతోనుందురా? అప్రతిష్ఠను గల్గించునిట్టి కూలిపనులు వారుచేయుదురా? ఇది యంతయు నన్ను బరాభవించుటకుఁ జేసిన వేషముచుమీ" యని యా యీజిప్టుప్రభువు మనస్సునందుఁదలచి జార్జి రాకుమారుని వంకఁ జాలఁ గోపముగు చూపు చూచుచుండెను.

రాకుమారుఁడదిచూచి, దాని యర్థము గ్రహించి "అయ్యా! నేనిపుడిందు లెఫ్టినెంటుద్యోగము నందుంటిని. నాయుద్యోగపు ధర్మమునునేను నిర్వహించుచుండవలయును గదా? నాపనినేనుచేయనిచో నాక్రిందివారు తమ పనులుసరిగాఁ జేయక విడిచిపెట్టెదరు. అందుచే ధర్మవిప్లవము జరుగు"నని విధేయతతోఁజెప్పి తానా వేషముతో వచ్చినందుల కాప్రభువు క్షమ నర్థించెను.

కాని, యాప్రభువు జార్జిరాకుమారుని యున్నత భావమును గుర్తింపలేకపోయెను. రాకుమారులన్నచో రత్నపుటుంగరములు ధరించి, పట్టుపుట్టములు కట్టి, దేహమందుఁ జందనముదిద్దుకొని, తాంబూలములు వేయుచు స్వర్గలోకమునుండి దిగివచ్చిన దేవతలట్లుండవలయునని భావించు నా యీజిప్టు ప్రభువు తనను జార్జికుమారుఁడు పరిభవించెనని భావించి యతని యుదారములును, సత్యములునగు మాటలు నమ్మక యెంతయో విధేయతతో వచ్చిన వాఁడయ్యును నతని ప్రార్థనమునకు మాఱు పలుకక యనుచితముగా నటనుండి వెంటనే వెడలిపోయెను.

తన ధర్మమును దాను నిర్వర్తించితినని తలఁచి జార్జిరాకుమారుఁ డిసుమంతయుఁ జింతింపక యాతని మూర్ఖత కాశ్చర్యము చెందుచు మరల నౌకలోబొగ్గును సర్దించుటకు వెళ్లెను. ఇట్టి యుత్తమధర్మ నిర్వహణమును విద్యార్థులు శ్రీజార్జిసార్వభౌముని జీవితమునుండి నేర్చుకొందురు గాక!.

తమ కీశ్వరుఁడిచ్చిన భూములను దున్నుట, పొలములలోఁ బనిచేయుట, పశువులను మేపుట మొదలగుపనులు నీచములుగా గణించి, క్రాపింగులు నీటుగా దువ్వుకొని, సొంత పనులను దిరస్కరించు నేఁటి విద్యార్థు లారాకుమారుని ధర్మనిర్వహణముం జూచి బుద్ధితెచ్చుకొందురు గాక!.

# ఎనిమిదవ ప్రకరణము.



## విక్టరు రాకుమారుని వివాహప్రయత్నము.

ఆ రాకుమారులు క్రమక్రమముగా నెల్లవిధముల నభివృద్ధి నొందుచుండిరి. జార్జి రాకుమారుఁడు తన 19 వ జన్మదినోత్సవమునందు సహాయ నావిక పదవినొందినట్లే 1890 వ సంవత్సరమునఁ దన యిరువదియైదవయేట నావికపదవి నొంది "త్రష్" అనునోడ కధికారి యాయెను. ఆ యోడ నతఁడు పడమటి యిండియా, ఉత్తర అమెరికాలలోని బ్రిటిషు స్థానములకు నడపి యా దేశములలో నోడమీఁదను, భూమిమీఁదను గూడ మంచికీర్తిగడించెను.

విక్టరు రాకుమారుఁడుకూడఁ గ్రమాభివృద్ధి నొందెను. అతని ప్రజాసేవ యతని కిదివఱకే ప్రజలలో మంచిపేరు కల్గించెను. కేంబ్రిడ్జిలోని యతని జీవిత మతనికిఁ బెక్కురు మంచి మిత్రుల నొసంగెను. అతని స్వాధీనములోనున్న 10వ హుస్సారు రెజిమెంటులోని యుద్ధభటులు, నుద్యోగులు నతని చాలఁ బ్రేమించుచుండిరి. అతని యభివృద్ధికి సంతసించి విక్టోరియా రాణి యతనికి "క్లారెన్సు ప్రభువు" అను బిరుదమిచ్చెను. ఇట్లిరువురును గ్రమాభివృద్ధినొంది విద్యాభివృద్ధిని, ప్రజల మన్ననలను బొందుచుండిరి.

ఇట్టి తరుణమున విక్టరున కతని 28 వ సంవత్సరమునఁ దగిన పెండ్లికూఁతును నిర్ణయించి పెండ్లిచేయవలయునని విక్టో

రియా రాజ్ఞి నిశ్చయించెను. రాజరక్తము హృదయనాళము లందుఁ బ్రవహించుచున్న కుటుంబములవారినుండియే యాసంబంధమును గుదుర్చుకొనవలయును.

తలిదండ్రులయు, ముత్తవయుదృష్టి "మే రాకుమారి" పైఁ బ్రసరించెను. ఆమె రాజకుటుంబమునకు బంధువురాలు; విక్టరు రాకుమారునికంటె మూఁడు నాలుగేండ్లు చిన్నది. ఆమె యాంగ్లకన్యక. ఆమెయందింగ్లీషు వారికెల్లరకుఁ బ్రేమ మిక్కుటము. విద్యావతి. సుగుణవతి. మఱియు నామెకిటాలియనుల సాహిత్యమునందును లలితకళలయందును జాలఁబ్రీతి కలదు. అందుచే నామె రెండేండ్లు తలిదండ్రులతోఁగూడ నాదేశమేగి యిటాలియనులభాషను, సాహిత్యమును నభ్యసించుటయే గాక యాభాష నాదేశీయుల స్వరముతోఁ దప్పులు లేకుండఁ జక్కఁగా మాట్లాడనేర్చి యుండెను.

ఆమె నేర్చినది యిటాలియనులభాష యొక్కటియేకాదు. ఫ్రెంచి, జర్మను భాషలలోఁగూడ మంచిపాండిత్యమును సంపాదించి యామె తన యుపాధ్యాయుల మెప్పునొందెను. ఆమె యాభాషలలో ధారాళముగా మాట్లాడఁగలదు. అంతేగాక యింగ్లీషు, ఫ్రెంచి, జర్మను, ఇటాలియను భాషలలోని యుత్తమ గ్రంథములనన్నిటిని నామెపఠించి యుండెను. ఆంగ్లములో టెన్నిసను, కార్లైలు, జార్జియాలియటు, ఎమర్సను లన్న నామెకెంతయో ప్రీతి. మెకాలే, ఫ్రూడు, లాంబు, జాన్ మార్లేలయు మాలియెరు, గోథె, డాంటీలయు గ్రంథముల నామె పఠించుచుండెడిది.

ఆ రాకుమారి యింగ్లాండునకుఁ దిరిగివచ్చెను. ఎడ్వర్డు ప్రభు వామె సద్గుణములు విని యు, స్వయముగా నెఱిఁగియు నామెను బ్రేమించి యెప్పుడామెను దన పెదకుమారునకు భార్యనుగాఁ జేయుదునా యని తలంచుచుండెను. అందుచే నామె యింగ్లాండునకు రాఁగనే యామె తల్లి యంగీకారమునొంది విక్టరును బెండ్లాడునట్లు నిర్ణయించి యావార్తను బ్రకటించెను. ఆవార్తవిని యింగ్లాండునందలి జనులెల్లరు సంతసించిరి.

1892 వ సంవత్సరములోఁ బెద్దకుమారునకును మేరాకుమారికిని వివాహము సలుపుటకు నిశ్చయించి, తల్లిదండ్రులగు నలెగ్జాండ్రా రాణియు, నెడ్వర్డు ప్రభువును వివాహ ప్రయత్నములు చేయుచుండిరి. విక్టోరియా చక్రవర్తినియు, నెడ్వర్డు ప్రభువునుగూడ వారి సామ్రాజ్యములో "మే" రాకుమారి కంటెఁదగిన కన్యక లేదనియుఁ జక్రవర్తినియై యా ధర్మము నుత్తమముగా నిర్వహించుటలో నామె కామెయే సాటియనియుఁ దలంచి వారిరువురకుఁ బెండ్లిచేయుటకుఁ ద్వరపడుచుండిరి.

ఇఁక విక్టరును, మే రాకుమారియుఁ జాల మైత్రితో మెలఁగుచు వివాహమయిన తరువాతఁ దమకాలమును లోకములోని పేదల కుపయోగించునట్లు ధర్మకార్యము లందుఁ గడపుటకు నిశ్చయించుకొనిరి.

---

# తొమ్మిదవ ప్రకరణము.



## దైవగతి!.

ఇట్లు రాజకుటుంబములోని వారెల్లరు బ్రహ్మానందము నందు మునిఁగి తేలుచుండఁగా వారికి విపత్తు తరువాత విపత్తు వాటిల్లెను.

1891 వ సంవత్సరము అక్టోబరు నెలలో జార్జిరాకుమారుఁడు డబ్లిను నగరమున కేగెను. అచ్చట నతనికి టైఫాయిడ్ జ్వరము తగిలెను. ఆజ్వరము చాల తక్కువగా నుండఁగనే యతఁడు స్టీమరులో వేగముగా నింగ్లండులోని శాండ్రింఘామునకువచ్చెను. కాని యతని జ్వరము చాలహెచ్చిపోయెను. అందుచే జాగ్రితగా మందిచ్చుట కతనిని లండనునకుఁ బంపిరి. అతఁడు జీవించునను నాశతొలఁగు చుండెను.

తల్లిగారగు నలెగ్జాండ్రా రాణిగారింట లేరు. ఇరువది యైదు సంవత్సరములలో నెప్పుడు నిల్లు విడిచిపెట్టని యా సాధ్వితోఁబుట్టువును జూచుటకు రషియాకు వెళ్లి యచటనుండెను. ఆమెను వెంటనేరమ్మని భర్తయుఁ గుమారుడును గబురుచేసిరి. 160 గంట లెడ తెగని ప్రయాణముచేసి యామె వచ్చి కుమారుని జూచెను. ఆమె వెళ్ళి పుత్రునిజూచునప్పటి కింకను గుమారుఁడు చాల సంధిగ్ధావస్థలోనే యుండెను. కాని, దైవవశమున జబ్బు మెల్లమెల్లగా నెమ్మదించెను.

రెండు నెలలయినను గాక ముందే 1892 వ సంవత్సరము జనవరి నెల 9 వ తేదీని పెద్దకుమారుఁడగు విక్టరునకు జాలఁ జెడ్డమాదిరి యిన్ఫ్లుయంజా రోగముతగిలెను. జబ్బు నెమ్మదించి కొంచెము కొంచెముగా నభివృద్ధిచెందుచు నింటిలోఁ దచ్చనలాడుచున్న జార్జిరాకుమారుఁడది విని దుఃఖించెను. మూఁడురోజులు రాత్రింబవళ్లు తల్లి కుమారుని మంచముకడ నేయుండి యుపచారము చేసెను. గొప్ప గొప్ప డాక్టరులు వచ్చి మందులిచ్చిరి. ప్రాణరక్షణము కొఱకెన్నియో సాధనములు చేసిరి. కాని, లాభము లేక పోయినది. తల్లిగారి చేతులలోనే విక్టరురాకుమారుఁడు జ్వరముతగిలిన యాఱవ నాఁడీలోకము విడిచెను.

రాజకుటుంబము దుఃఖసముద్రములో మునిఁగెను. ప్రాణమిత్రుఁడును సోదరుఁడు నగు విక్టరుమరణమునకుఁ దమ్ముఁడు చాల దుఃఖించెను. ఇంగ్లాండునం దాబాలగోపాలము జనులు చింతించిరి. ప్రపంచములోని సర్వభాగములనుండి విచారమును దెలుపు తంతివార్తల జడివాన కురిసెను.

ఆవార్తలకిట్లు రాజ భవనమునుండి యువరాజుదంపతులు సమాధానమిచ్చిరి.

విండసరు రాజభవనము,
జనవరి 20, 1892.

"మా కత్యంతప్రేమ పాత్రుఁడగు మా పెద్దకుమారుఁడు చనిపోయినందుచే మేము దుఃఖసముద్రమునందు మునిగి

యుండ బ్రిటీషు దీవులనుండియుఁ, గాలనీల నుండియు హిందూ దేశమునుండియు సర్వజనులును జూపుచున్న యపారమగు సానుభూతికి యువరాజ్ఞీ యువరాజులమగు మేము మాగాఢ మగు కృతజ్ఞతను దెలుపుకొనుచుంటిమి. ఇట్టి యాపత్కాల మునందు మా దుఃఖమును సర్వజాతులవారును సమముగాఁ బంచుకొనిరన్న భావము మమ్ముల నింకను హెచ్చుగా మా సామ్రాజ్యవాసులను బ్రేమించునట్లు గట్టిగా బంధించివేయు చున్నది."

ఇట్లు,
మిమ్ముఁబ్రేమించు
అలెగ్జాండ్రారాణి, వేల్సుప్రభువు ఎడ్వర్డు.

విదేశములోనుండి తంతివార్తద్వారా సానుభూతినంపిన కాంటర్బరీ మతాధ్యక్షునకుఁగూడ నొకలేఖను నెడ్వర్డు యువ రాజువ్రాసెను. దానిలోఁ గొంతభాగ మిందుఁ బ్రచురించి నచో యువరాజ్ఞియు, యువరాజు నెంత దుఃఖమనుభవించిరో తెలియఁగలదు.

విండసరు రాజభవనము,
జనవరి 20, 1892.

"కాంటర్బరీ మతాధ్యక్షా! పెద్దకుమారుని మరణముచే మాకుఁగల్గిన విపత్తుయొక్క పరిమితిని మేము గ్రహింపలే కుంటిమి. మాకుటుంబములో నొక్కరుగా మీరు పెక్కుసార్లు

సామాధ్య మెలంగుచుండెడివారు. అందుచేఁ జనిపోయిన రాకు మారుఁడును మేమును నెట్లు విడఁదీయరాని కుటుంబముగా నుంటిమో మీ రెఱుంగుదురు. అట్టి పెద్దబిడ్డను నేఁడు దేవుఁడు బలాత్కారముగా మాకడనుండి హరించినాఁడు. ఈ దుఃఖము మా కీజన్మమధ్యమునఁ దీరదు.

ఇప్పటికి సరిగా నతనికిరువది యెనిమిది వత్సరములు. కొలఁదిరోజులలో నతఁడు సౌందర్యవతియు, విద్యావతియు నగు మేరాకుమారుని వివాహమాడి సంతోషకరమగు జీవితమును గడపఁగల్గెడివాఁడు. అదియంతయు గతించినది. అతని యవివాహితయగు పెండ్లికూఁతురతని విధవయైనది!.

దేవుని మార్గములు మనకు గ్రహింపరానివి. అతఁడు చేయునది యెల్ల మనమేలుకొఱకే. అందుచే మనమతని పనులనుగూర్చి గొణఁగుకొనరాదు. బహుశః ఈలోక సంబంధములగు సర్వదుఃఖములను విడిచినా పెద్ద కుమారుఁడు భగవంతుని సన్నిధియందు నిత్య సంతోషముతోనుండి యుండును. మా యీదుఃఖకాలములో తమబోఁటి సన్నిహిత మిత్రులును, దక్కిన యెల్లతరగతులవారును జూపుచున్న సానుభూతి మా దుఃఖమును శమింపఁజేయుచున్నది.

పరమేశ్వరుని కోరిక నెఱవేరునుగాక!”

ఇట్లు,
ప్రియమిత్రుఁడు
వేల్సు ప్రభువు ఎడ్వర్డు.

# పదియవ ప్రకరణము.



## జార్జి రాకుమారుని వివాహము.

విక్టరు రాకుమారుని మరణముచేఁ గలిగిన విచార సముద్రమునం దింగ్లండు మునిఁగియుండెను. అలెగ్జాండ్రా రాజ్ఞికిఁ గడుపునఁదీరని చిచ్చువెట్టిన యీ విక్టరు రాకుమారుని మరణమునకు బ్రిటిషు దీవులలోని తల్లులందఱు దుఃఖించిరి. ఆస్థానకవియగు టెన్నిసనా దుఃఖమును బద్యములలో వెల్లడించెను. మహామంత్రియగు గ్లాడుస్టను ఛార్లెటీరాకుమారి మరణగాధనుజెప్పి విక్టోరియారాజ్ఞి దుఃఖము నుపశమింపఁజేసెను.

కుమారుని మరణానంతరము తల్లియగు నలెగ్జాండ్రా సతియుఁ, దండ్రియగు నెడ్వర్డుప్రభువును గొన్ని వారము లీస్టుబోరనునందలి సముద్రతీరగృహమునం దేకాంతవాసము చేసిరి. వారప్పుడచ్చట నెవరికిని దర్శనము లొసంగనేలేదు. తరువాత సంవత్సరమువఱకుఁ దీరని విచారముతోనుండి యెట్టిదగ్గఱ బంధువుల పెండ్లిండ్లకుఁగూడ వారువెళ్లరైరి.

జార్జి రాకుమారునికిఁ గూడ దుఃఖము భరింపరానిదిగా నుండెను. వారిరువురు నొకటే ప్రాణముగా నుండి

యయిదు సముద్రములందలి రాజ్యములను నేకముగా దిరిగి చూచివచ్చిరి. కష్టసుఖము లేకముగా ననుభవించుచుండిరి. వారి పరస్పరప్రేమ నిరుపమానము. అందుచే నన్నగారి మరణముచేఁగల్గిన దుఃఖము నాతఁడు పెద్దకాలమువఱకుఁ దుడిచివేయ జాలకుండెను.

"మే" రాకుమారి దుఃఖ మనిర్వచనీయము. నెల రోజులలోఁ బెండ్లియై సర్వసౌఖ్యములు ననుభవింతునని యువ్విళులూరుచున్న యామె దుఃఖమునకు మేరయుండదు గదా? అంతేగాదు వారిరువురు నొకేవయస్సు కలవారు. బంధువులు, మిత్రులు, మనస్సుకలిసినవారు. సర్వసంపదలు కలవారు. అట్టి సందర్భములలోఁ గల్గిన వియోగము చాల దుస్సహాముగా నుండుట సహాజముకదా!

ఆమె సంతోషకరములగు వినోదముల నన్నిటిని విడిచి మాసములకొలఁది కాలమింట దుఃఖముతోఁ గడపెను. విక్టరు రాకుమారునియందు గాఢముగాఁ బాదుకొనియున్న యామె హృదయము వికలమైపోయెను. అందుచే నామె సన్నిహితబంధువులు పోరి చెప్పినను వివాహాముమాట తల పెట్టక యితరులకు మేలుకూర్చు సత్కార్యములు సేయుచుఁ బేదవారికి బట్టలుకుట్టియిచ్చుట, భోజనముపెట్టుట, దాన ధర్మములు చేయుట మొదలగు పనులందుఁ గాలముగడపెను.

మే రాకుమారిని దమ రెండవ కుమారునికి ధర్మపత్నినిగాఁ జేయవలయునను కోరిక యలెగ్జాండ్రా రాణికిని నెడ్వర్డు ప్రభువునకును దీవ్రముగాఁ గల్గెను. కాని, యామె దుఃఖము నందుండుటచే వారికోరిక, కభ్యంతరము కల్గుచుండెను. 'నాలుగు, 'ఐదు', 'ఆఱు' నెలలు గడిచిపోవుచుండెను. మేరాకుమారి సమ్మతినీయలేదు. ప్రజలాశుభవార్త యెప్పుడు విందుమాయని కనిపెట్టుకొనియుండిరి. కాని, వారికోరిక నెఱవేరలేదు. తొమ్మిది, పది, పదునొకండు మాసములుగడచెను. రాకుమారి సమ్మతించునట్లు కనఁబడలేదు. సంవత్సరముకూడ గతించిపోయెను. కాని యామె సమ్మతినొసంగలేదు. అందుచేఁ బ్రజలింక నా సంబంధము కుదురదని నిశ్చయించి విరక్తిఁజెందిరి.

కాని, యెట్టకేల కెడ్వర్డు దంపతుల ప్రోత్సాహము చేతను, జార్జి రాకుమారుఁడు సత్యమగు ప్రేమతో వరించుచుండుటచేతను విధిలేక "మే" రాకుమారి యతనిం బెండ్లియాడుట కంగీకరించెను. అమె తల్లికూడ నాపెండ్లికి సమ్మతించెను. అంత నాసంతోషవార్తను 1893 వ సంవత్సరము మే నెల మూఁడవ తేదీని ననఁగా విక్టరు రాకుమారుఁడు చనిపోయిన పిమ్మట రమారమి 17 మాసములకు రాజ భవనమునుండి ప్రకటించిరి. ఆంగ్లదేశీయులెల్లరును బరమానంద భరితులైరి.

మే రాకుమారి తనవివాహపు దుస్తుల నాంగ్లదేశము నందుత్పత్తియైన వస్తువులనుండియే తయారుచేయించుకొనెను. "తూర్పులండను సిల్కు మిల్లుల"కు స్వయముగానేగి చాల రమ్యములగు రకములేరి వానినుండియే తనకును, దన భర్తగారికిని గావలసిన దుస్తులను గుట్టించెను. ఆమె తల్లికిఁగూడ స్వదేశవస్తువులను వాడుటయేప్రీతి. ఆమెనొక మిత్రురాలు "మీరు కూర్చున్న సోఫా మెత్తగానున్నదా?" యని ప్రశ్నింపఁగా, నామె "అవును! అది స్వదేశవస్తువులచేఁ దయారైనది; అందుచే నది నాకుఁజాల సౌఖ్యముగా నున్నది" యనెను. అట్టి యుత్తమ భావములతోఁ బెంచఁబడిన "మే" రాకుమారి వేఱొకవిధముగాఁ బ్రవర్తింపదుకదా?

జూలై నెల 6వ తేదీని వివాహము వైభవముగా జరిగెను. విక్టోరియారాజ్ఞి, తనమంత్రులు మొదలగు నుద్యోగులు రాకమున్నే, యందఱకంటె ముందుగా వివాహకాలమున కెంతయో పూర్వమే వెళ్లి చర్చిలో వివాహపీఠమునకు సమీపప్రదేశమునందుఁ గూరుచుండెను. యూరపుఖండమునందలి రాజులెల్లరుఁ దమప్రతినిధుల నంపిరి. డెన్మార్కు రాజును, రాణియు స్వయముగావచ్చిరి. రాజబంధువులయు, రాజప్రతినిధులయు, మంత్రులయు, నింగ్లండులోనిగొప్ప గొప్ప ప్రభువులయు వివిధ వర్ణములుకలదుస్తులును, రత్నఖచిత సువర్ణ భూషణపరంపరలును గనులకు మిఱుమిట్లు గొలుపునా వివాహమందిరము స్వర్గ

లోకములోని తేజోవంతమగు నింద్రుని సభామండపముం గేలి చేయుచు వర్ణనాతీతమై యొప్పుచుండెను. వివిధాలంకార శోభితలగు పదుగురు తోడిపెండ్లికూతుండ్రు రాజ్ఞి వెంట నుండిరి. ఎడింబరో ప్రభువు జార్జిరాకుమారునకుఁ దోడిపెండ్లి కొడుకుగానుండెను. బంగరునందు పొదివిన నగలరాసుల కాంతులాభవనము నందెల్లడల నిండి వింతవింతలగు కళలు గ్రుమ్మరించుచుండెను. తళతళ మెఱయుచున్న బంగరు జరీచీరెలు, తలగుడ్డలు, నంగరకాలు ధరించిన హైందవ భూమిపాలురు, భారత నారీమణులుకూడ నా వివాహవేదికకు నూతనాలంకారములు కూర్చుచుండిరి. ప్రపంచములోని యున్నతములగు సామ్రాజ్యములలో నెల్ల నున్నతమగు బ్రిటిషుసామ్రాజ్యము యొక్క భవితవ్యమును శాసించు శ్రీ విక్టోరియారాజ్ఞి మనుమని వివాహమట్లు వివిధ దేశాగత, సామ్రాట్టులయు, మహారాజులయు, స్వతంత్రప్రభువులయు సమక్షమునం దద్వితీయ వైభవముతో సుముహూర్తమునందు జరిగెను.

ఆనాఁటి లండననగర వైభవము వర్ణింపరాకయుండెను. నాఁటిరేయి లండనునందు వెలిగిన విద్యుద్దీపము లనంతములు. తెల్లరంగులు, పచ్చరంగులు, నీలపురంగులు నింక నెన్నియో రంగులుకల యసంఖ్యాకములగు నాదీపములు భూమికి వింతరంగులతో దిగివచ్చిన నక్షత్రరాసులో యన నొప్పి చూపఱ కానందముం గూర్చుచుండెను. ఎడ్వర్డు

ప్రభువునివసించు సెంటుజేమ్సు రాజభవనము చుట్టును లక్షల కొలఁది జనులుమూఁగి యా ప్రభువును వెలుపలకురమ్మని భూనభోంతరాళములు మాఱుమ్రోయునట్లు కేకలిడిరి. ఎడ్వర్డుప్రభువుకంటెఁ బ్రజల మెప్పందిన జనుఁడు మఱి యొకఁడు బ్రిటిషు ద్వీపములలోఁ—గాదు బ్రిటిషు సామ్రాజ్యములో—లేఁడు. అందుచే నా సంతోషసమయమున లక్షల కొలఁది ప్రజలాతని యానందమునుఁ గండ్లారఁ జూడనెంచి యతని నారాజభవనము ముందుప్రక్కకు రమ్మని పిలిచిరి. వారి కోరిక తీసివేయలేక యతఁడువచ్చి చిన్న కుర్చీయొకటి తన తలచుట్టును ద్రిప్పుకొనుచుఁ దనకుఁగల్గిన యానందమును వెల్లడించెను. సంతసముతో నోడలుమఱచియున్న ప్రజలలోఁ గొందఱు "ఆ కుర్చీని మాకిండు" అని కేకలువైచిరి. రాజు సంతసముతో నాకుర్చీని వారికిచ్చెను. ఇట్లు సంతోషముచే నొడలుమఱచి లక్షలకొలఁది ప్రజలు నాఁడు జార్జి రాకుమారుని వివాహమునుజూచి తమ యిచ్చవచ్చిన గీతుల నానందించిరి.

వివాహానంతరము చర్చినుండి యా నూతన దంపతులు బకింగుహాము రాజభవనమున కేగి యటనుండి దాంపత్య సుఖముననుభవించుట కొఱకేర్పఱచిన శాండ్రింగుహాములోని నూతన భవనమున కేగి వారు కొంతకాలము లోకవ్యవహారములతో సంబంధములేకుండ హాయిగాఁ గాలముగడపిరి.

---

# పదునొకండవ ప్రకరణము.



## సంతానము : గార్హ్యపత్య జీవితము.

నిష్కలుషమగు పరస్పరప్రేమగల యీ దంపతుల కీశ్వరుఁ డాశీర్వదించి వెంటనే సంతానమునొసంగెను. ఆఱు సంవత్సరముల కాలములో ముగ్గురు కుమారులను, నొక్క కుమారిని నాదంపతులకు భగవంతుఁడిచ్చెను. వారిని దల్లి దండ్రులు ముద్దుగాఁ బెంచుకొనుచుండిరి.

ఆదంపతుల గార్హ్యపత్య జీవితము చాల మధురమైనది. పిల్లలను దాస దాసీజనులచేతిలో సర్వకాలమునుంచి షికార్లు చేయుచుండు నేఁటికాలపు సుందరీమణులవలెఁ గాక "మే" రాకుమారి బిడ్డలను స్వయముగా శ్రద్ధతోఁ బెంచుచుండెడిది. ఆమెకుఁ బిల్లలన్నఁ జాలఁ బ్రీతి. అందుచేఁ దనపిల్లలనింట నుంచి పొరుగూళ్లకుఁగాని, విదేశములకుఁగాని యామె యెప్పుడును బోవలేదు. తనవెంటనుంచుకొని జాగ్రతతో వారికిఁ గావలసిన చిన్న విషయములలోఁ గూడ శ్రద్ధతీసికొని బాల్యమునందు వారిని గండ్లనిడుకొని పెంచుచుండె డిది. జార్జి రాకుమారుఁడు కూడఁ బిల్లలను చిన్నప్పటినుండి యెత్తి ముద్దాడుచుఁ బెంచి యయిదాఱు వత్సరములురాఁగనే గుఱ్ఱములమీఁద నెక్కించి వారివెంటఁ దానుగూడ నొక

గుఱ్ఱముపై నెక్కి మెల్లగాఁబోవుచు వారికి గుఱ్ఱపు స్వారి నేర్పుచుండెడివాఁడు. మఱియు శాండ్రింఘాముదగ్గఱఁ గల పంట చేలనుజూపి వారి నానందింపఁజేయుచుఁ దనకుఁ దీరికగానుండు కాలమును వారితోఁ గడపుచుండెడివాఁడు.

సముద్రయానము జార్జిరాకుమారున కెంతయో ప్రీతి. దానిని విడుచుట మొదటఁగష్టముగనే యుండెను. కాని యాతఁడు నెమ్మదిగా రైతుల గార్హ్యపత్యజీవితము నలవఱచుకొని వ్యవసాయము చేయుట; పశువులను బెంచుట నేర్చుకొనెను. తండ్రికి గుఱ్ఱపుఁబందెము లన్నఁ జాలనిష్టము. కాని, జార్జిరాకుమారునకది వెగటు. అయినను గుఱ్ఱపు స్వారి యందితని కెక్కువమక్కువకలదు. అందుచేఁ దాను గుఱ్ఱపు స్వారి చేయుటయే గాక బిడ్డలకుఁగూడ దానిని నేర్పుచుండెడి వాఁడు.

గుఱితప్పక తుపాకినిగాల్చుటలో నతనికిఁజాల కౌశల ముండెను. అది సాధనముచేయఁగాఁ జేయఁగా, దుదకం దతఁడు గొప్పప్రవీణుఁడై "తప్పనిగుఱికాఁడు" అను పేరు నందెను. వేఁటాడుటలో నతఁడు చాలఁబ్రవీణుఁడగుట కతనికి గుఱితప్పకుండఁగొట్టుట చాలఁ దోడ్పడుచుండెడిది. వేఁటకుఁ గావలసిన యన్నిపరికరములను సంపాదించియుంచి మంచి వేఁటకాఁడై యెప్పటికప్పుడు నవీనములగు పద్ధతులు నేర్చుకొనుచు నం దతఁడుసాటిలేని నేర్పరితనమును గడించెను.

అతఁడు గ్రంథపఠనము చాలఁ గొలఁదిగనే చేయు చుండెడివాఁడు. తన సతీమణియగు "మే" రాకుమారివలె సాహిత్యగ్రంథముల నతఁడు చదువుచుండెడివాఁడు కాఁడు. ఒక్క "రుడ్యార్డుకిప్లింగు" అను గ్రంథకర్తతప్ప యతని సన్నిహితమిత్రులలో విఖ్యాతులగు గ్రంథకర్తలు లేనిమాటకూడ సత్యమే. కాని, యతఁడు వినికిడిచే నెవరెట్టి గొప్పగ్రంథకర్తలో చక్కగాగ్రహించి యా యాగ్రంథకర్తలలోనుండు ప్రత్యేకములగు శక్తులను సరిగావర్ణించి చెప్పుచుండెడివాఁడు. అతని యాశక్తి పెక్కురకుఁ జాల నాశ్చర్యము కల్గించు చుండెడిది. అంతేగాక, యతఁడు గ్రంథకర్తలను గవులను జక్కగా గౌరవించు చుండెడివాఁడు.

ఇఁక రాకుమారికిఁ బ్రియములగు కార్యములను విలోకింతము. బిడ్డలను బెంచుటకుఁ బిమ్మట నామెకు లలిత కళలందుఁ జాలమక్కువకలదు. విశ్రాంతిచిక్కిన సాయంసమయముల నామె యేమ్యూజియమునందో, లేక లలితగళా ప్రదర్శనమునందో కడపుచు రమ్యములగు చిత్రములలోని మంచి చెడ్డలను నిర్భయముగా విమర్శించుచుండెడిది. మఱియు నితరుల యభిప్రాయములనుబట్టి కాక తనంతతానే యాచిత్రముల మంచిచెడ్డలు నిర్ణయించుచుండెడిది.

పూర్వకాలపు శిథిలగృహములు, నేఁడు వాఁడుకలో లేని ప్రాచీన రాజభవనములు చూచి వాని వాస్తుశాస్త్రముల నెఱుఁగుటలో నామెకుఁ జాల నభిలాష కలదు. అందుచేఁ దాను వెళ్లినచోటులందెల్ల వానిని బరీక్షించి యామె క్రొత్త విషయములు నేర్చుకొనుచుండెడిది.

ఇంటిలో వాఁడుకొను వెండి, బంగారు పాత్రలను జాల రమ్యములగు పద్ధతులలోఁ దయారుచేయించుట యందామెకుఁగల మక్కువ యితరులకెవరికిని లేదనవచ్చును. అందుచే నామె విదేశములలోఁజూచిన పద్ధతులను మఱపుగాన క తెచ్చి, యింగ్లాండులోని కంపెనీలవారికిఁ జూపించి, యెన్నియో క్రొత్త రకములుగా బంగారువెండి సామానులను, సోఫాలు, కుర్చీలు, మేజాబల్లలు మొదలగు గృహోపకరణములను జేయుంచుచుండెడిది.

అన్నిటికంటె నామెకుఁ బ్రియమైనది బీదవారలకు మేలుచేయుటయు, ధర్మకార్యములు నిర్వహించుటయు. అనేక ధర్మసంఘములలో నామె సభ్యురాలుగాఁ జేరెను. కొలఁది వేతనముతో రాత్రింబవళ్లు బట్టలు కుట్టుట, బంగారు వెండిగొలుసులు చేయుట మొదలగు పనులుచేయు స్త్రీ పురుషులనుద్ధరించుట లోనగు ధర్మకార్యములందామె ప్రత్యేకముగు శ్రద్ధ తీసికొనుచుండెడిది.

ఆమె తల్లి "కూంబెవుడ్డు" నందొక ధర్మశాలను స్థాపించెను. యజమానుల యొత్తిడిచేఁ గష్టములగు పనులు చేసి తమ యారోగ్యమును గోల్పోయిన వారేక కాలమునందా ఱుగురు చొప్పున నందు నివసించుచు స్వస్థత నందుచుండవచ్చును. మేరాకుమారి దానిని సంరక్షించుటయే గాక "బోనరు" నందుఁ గార్మిక స్త్రీలకు వేఱొక విశ్రాంతి గృహమును స్థాపించెను. "సర్రే" యందుఁ గూడ దాదుల కొక పోషణ గృహమును స్థాపించి యీ యన్ని సంస్థలలోనివారి మంచి చెడ్డలను మోటారులో వెళ్లి తెలిసికొని యా యా లోటు పాటులు తీర్చు చుండెడిది. తల్లిస్థాపించిన "కుట్టుపని గృహము"న కామె మరణానంతరము తానే యధ్యక్షురాలై బీద వారలకు వస్త్రదానము చేయించు చుండెడిది.

ఈ సందర్భమునందు మనము శ్రీ "మే"రా కుమారి యంతశ్శుద్ధిని దెలియఁజేయు నొక ముఖ్య విషయమును గమనింపవలయును. ఈరు, వారు నొసఁగిన చొక్కాలు మొదలగుదుస్తులు పంచిపెట్టుటతోఁ దృప్తిచెందక యామె తన చేతులతో సంవత్సరమున కరువదిమందికిఁ దక్కువ గాకుండ దుస్తులుకుట్టి బీద బాల బాలికలకుఁ బంచిపెట్టుచుండును. "అన్ని దుస్తులను గుట్టుటకు మీకు వ్యవధి యెక్కడిది?" అని యామె స్నేహితురాలొక ర్తామెను బ్రశ్నింపఁగా "ఎప్పుడును

నా సంచిలో సూదియు దారమును గుడ్డయు నుండును. వ్యవధి దొరకినపుడెల్ల నేనా పని చేయుచుందును" అని యామె సమాధానమును జెప్పెను. ఆమె హృదయ మెంత ధర్మతత్పరము!.

ఆమె తన సేవకులయందుఁ జాలదయ గలిగి యుండెడిది. వారికిండ్లు కట్టుకొనుటకును, గష్టములేని సుఖజీవనము చేయుటకును మిక్కిలిఁ దోడ్పడుచుండెడిది. వారియెడఁ బరుషవాక్యములాడదు. వారు విశ్రాంతి పుచ్చుకొనవలసిన కాలములోఁ దనపనులు చేయనక్కఱలేకుండ వారిని బనినుండి విడిచిపెట్టెడిది. వా రితరులను జూడఁబోవుటకుఁ జేసికొన్న సమయములను దప్పించెడిదికాదు.

అంత మంచి గుణములుగల యీ రాజ్ఞి తన బాలురకుఁ జక్కని శిక్షణమునొసంగుటలో నాశ్చర్యములేదు. శమము, దమము కల్గియుండునట్లామె బాలురకు బోధించియితరులయెడ వాక్పారుష్యము నుపయోగింపకుండునట్లు చేసెడిది. ఎట్టి కష్టసమయములందుఁగూడఁ గోపములేకుండ శాంతముతో నుండవలయునని యితరులను దిట్టరాదని, కొట్టరాదని బిడ్డలకు బోధించుచుండెడిది.

ఇట్లా రాకుమారియు, రాకుమారుఁడును సంతోషముతో శాండ్రింఘామునందుఁ దమ వివాహామునకుఁ బిమ్మట నేకష్టములును లేక రమారమి యేడేండ్లు కడపిరి.

---

# పండ్రెండవ ప్రకరణము.



## మఱియొక గొప్ప ప్రయాణము.

1901 వ సంవత్సరము జనవరి నెల మొదటి తేదీని సంవత్సరాది పండువు నాఁడు జార్జి రాకుమారుఁడు శ్రీ విక్టోరియా చక్రవర్తిని గారి నౌకాదళమునకుఁ బరోక్షపు నాయకుఁడాయెను. కొలఁది రోజులకుఁ బిమ్మట నతఁడు ప్రధాన నౌకాదళాధ్యక్షుఁడు కూడ నాయెను.

ఇంతలో శ్రీ విక్టోరియా చక్రవర్తిని యీ సంవత్సరము జనవరి నెల 22 వ తేదీని శాంతముగాఁ బరలోకమేగెను. ఆమె యంత్యక్రియలు వైభవముతో నిర్వర్తింపఁబడెను.

ఆస్ట్రేలియాలో నూతనముగా నిర్మించిన పార్లమెంటు భవనములను దెఱచుటకు మార్చి నెల 16 వ తేదీని జార్జి రాకుమారుఁడు "ఒఫీరు" స్టీమరుమీఁదఁ బయలుదేఱి వెళ్ళెను.

ఒఫీరు నందు 125 మంది నీలపుఁ జొక్కాలు ధరించిన సరంగులును, 100 మంది సహాయకులగు సరంగులును, 37 గురు బ్యాండు వాద్యము చేయువారును, 20 మంది బాలు

రును, నేడుగురు యంత్రశాస్త్ర మభ్యసించిన యింజినీర్లును, వారికిఁ దోడ్పడు యంత్రశాస్త్రశాఖవారు మఱియెనుబది యెనిమిది మందియు, 50 మంది వంటవారు, కసాయీ వారు, మంగళ్లు, స్టీమరులకురంగులు వేయువారు మొదలగు వారును నుండిరి. వారితోఁ గూడ నొక చాకలియు వాని భార్యయు నుండిరి. ఎవరును భార్యలను వెంటఁదీసికొని వెళ్ళరాదని నిషేధించిన సేనాధిపతులీ చాఁకలివాని విషయములో నేల మినహాయింపు నొసంగిరో తెలియదు.

వారు మొదట జిబ్రాల్టరున కేగిరి. ఆ రాజ కుమార దంపతుల స్టీమరు వెంట గౌరవార్థము కొంత దూరము "డైడెం" 'నియోబి' అను రెండు స్టీమరులు వెంబడించి పిదప నాపనిని మఱి రెండు స్టీమరుల కప్పఁజెప్పి యవి తమ స్థానము నకుఁ దిరిగి వెళ్లిపోయెను.

నల్లగా సౌందర్యము లేక కనఁబడు సాధారణయుద్ధనౌకలవలెఁ గాక వెల్లనికాంతులీను రంగులు పూసినవియు, ప్రకాశించుచున్న యిత్తడితొడుగుచే మెఱయుచు రెండంతస్థులు కలవియునగు నారాజకుమారుని స్టీమరులు పవళ్లయందుఁ జూపఱకు ముద్దులు కొలుపుచుండెను. అట్లే గౌరవార్థము వెంట వచ్చుచున్న స్టీమరులందును, "ఒఫీరు" నందును వెలుంగుచున్న విద్యుద్దీపములు కండ్లు మిఱుమిట్లు

గొలుపుచుండ రాత్రులందుఁ గూడ నాస్టీమరు సముద్రముపైఁ దేలియాడుచున్న దివ్యప్రాసాదముంబోలె జూచువారి కానందతరంగములు పర్వుచుండెను.

ఆ దంపతులకు "మాల్టా" ద్వీపమునందు బ్రహ్మాండమగు స్వాగతము జరిగెను. అతని సంతసింపఁజేయుటకు వారు వింతవింతలగు వస్తువులు సృష్టించిరి. అందు వింత జంతువుల నుంచు సముద్రగృహమొకటి. అది సముద్రముపైఁ దేలియాడుచుఁ బెక్కు వింతలగు జంతువులు కల్గి యుండెను. అందున్న ముఖ్యజంతువులలో బ్రహ్మాండమగు సముద్రసర్పమొకటియు, నలువది యడుగుల పొడవుగల తిమింగలపు జాతికిఁ జెందిన "డాల్ఫిను" అను జంతువొకటియు. అట్టి చిత్రములగు జంతువు లింకను నందనేకములుండెను.

తరువాత "సూయజు" కాలువ మీఁదుగా బ్రయాణము చేసి యెఱ్ఱ సముద్రమున కా రాజదంపతులు వచ్చిరి. యేప్రిలు 7 వ తేదీని "ఏడెను" చేరిరి. ఏడెను సముద్రపు రేవున్నతములగు నగ్ని పర్వతముల మాటున డాఁగి కన్పడ రాక యుండును. పూర్వకాలమునఁ బైకెగసివచ్చిన బూడిద రాసు లిప్పటికిని గన్పట్టు చుండును. ఏడెనునకు వెళ్లు రోడ్డు చక్కగా నుండెను. ఎదురుగా వచ్చిన జనసమూహముల మధ్యగా జాగ్రతగా నడపుకొని వెళ్లియేడెను పట్టణము

నా దంపతులీక్షించిరి. పిమ్మటఁ గొండలమీఁద నుండి పడు చున్న జలధారలు చూచి సంతసించిరి. ఇక్కడవఱకు గౌర వార్థము వచ్చిన స్టీమరుల నిచ్చట నాపి మరల "జూనో" "సెంటుజార్జి" అను రెండు క్రొత్త యోడలను శ్రీ వారి స్టీమరు వెంటఁబంపిరి.

అడవులతోఁ గప్పబడిన తీరముగల "సుమిత్ర" దీవిని దాటి యోఫీరు "సుండా సింధుశాఖ"లోఁ బ్రవేశించెను. సుమిత్రా జావాల మధ్యగల మనోజ్ఞమగు కాలువ తూర్పు హిందూ మహా సముద్రమునకును, జావాసముద్రమునకును ద్వారమో యనునట్లుండెను.

"సుండా సింధుశాఖ"ను దాఁటి వారు "పశ్చిమ ఆస్ట్రేలియా"కు వెడలిరి. వెనుకటిసారి ప్రయాణము వలెఁ గాక యీసారి యాస్ట్రేలియా ప్రయాణము చాల రమ్య ముగా నుండెను. ఆ రాజ కుమార దంపతు లాస్ట్రేలియాకుఁ జేరిరి. మే నెల 6 వ తేదీని మెల్బోరను నగరమునందా రాజ కుమార దంపతులు ప్రవేశించునట్లు నిర్ణయింపఁ బడెను. ఆస్ట్రేలియా దేశవాసుల యుత్సాహమునకు మేరలేదు. అప్పటికైదు లక్షల జనులు నివసించుచున్న మెల్బోరను పట్టణమునకు దేశములోని నాల్గుప్రక్కల నుండియు సుమారు నాల్గులక్షల జనమా తేదీనాఁటికివచ్చిరి. అంతకుఁ

బూర్వము కొలఁది రోజులకుఁ ముందే యాస్ట్రేలియా లోని వివిధప్రదేశముల నుండియు భూస్వాములు, గొప్ప రైతులు, ధనవంతులు, పలుకుబడికలవారు, రాజకీయ వేత్తలు, కవులు, గాయకులు, మొదలగు వారొకలక్షమంది వచ్చి పట్టణములోని యింటింటను, బసచేసియుండిరి. ఇట్లు యార్కుప్రభువును, యార్కురాణియు వచ్చునాఁటికిఁ బట్టణములో రమారమి పదిలక్షలజనము చేరియుండెను.

మే నెల 6 వ తేదీ నాస్ట్రేలియను దేశవాసులా యార్కు ప్రభు దంపతులకుఁ గొప్పస్వాగతమిచ్చిరి. ఆదేశస్థుల యుత్సాహమునకు మితిలేదు. వారు మాతృభూమియగు నింగ్లండును గాఢముగాఁ బ్రేమించిరి. ఆ ప్రేమయంతయు నా స్వాగతమునందు మూర్తీభవించి యుండెను.

9వ తేదీని జరుగఁబోవు పార్లమెంటు ప్రారంభోత్సవమున కేర్పాటులు చాల జాగ్రతగను, రమ్యముగను జరుపఁబడెను. "సెయింటు కిల్డాసుపైరు" అను స్థలమునుండి సుమారెనిమిదిమైళ్లదూరము ప్రధాన వీధులన్నిటి యందును సైని కులుకాపుకాచి శాంతిని నెలకొల్పిరి. ఆవీధుల రెండుప్రక్కలను గాలరీలపై జనులుండిరి. లండనులో జరిగిన వానికంటె నాయేర్పాటు లద్భుతముగానుండెను. ఆస్ట్రేలియాలోనియాంతు పరగణాల నుండియు వచ్చిన సైన్యములు జట్లు జట్లుగా

శ్రీ రాజకుమార దంపతులయు వారి సహచరులయు వెనుక నడచుచుండెను.

మెల్బోరను లోని ప్రధానమగు పార్కు కడకు రాఁగనే 35 వేలమంది స్కూలు పిల్లలు బారులు తీర్చి "దేవుడు రాజును రక్షించునుగాక!" యను కీర్తనము నాహ్లాదకరముగా, నుత్సాహముతోఁ బాడిరి.

9 వ తేదీ వచ్చెను. నాఁడు సార్వభౌముని ప్రతినిధిగా జార్జి రాకుమారుఁడు పార్లమెంటునకుఁ బ్రారంభోత్సవము చేయనుండెను. మరల వీధులు జన సముద్రముతో నిండెను. ప్రదర్శన మందిరమునందుఁ బండ్రెండు వేలమంది రాకుమారుని రాక కెదురు చూచుచుండిరి. అందాస్ట్రేలియాలోని యాఱు రాష్ట్రములలోని ప్రముఖులును గలరు.

వివిధములగు నలంకారములతో, సుగంధ ద్రవ్యములతో బ్యాండు వాద్యములతో, రాజకీయ వేత్తలతోఁ రాష్ట్ర ప్రతినిధులతో, ద్రష్టలతోఁ గ్రిక్కిరిసి నిండియున్న యా మహా సభావరణములోని వేదిక కడకు రాజకుమార దంపతులు రాఁగనే మంగళవాద్యములు మిన్నుముట్ట మ్రోసెను. బ్యాండు గాయకులు గీతములుపాడిరి. అర్కెస్ట్రామీఁద రాజభక్తిని వెల్లడించు పాటలు గాయకులు పాడి యా క్రొత్త పార్లమెంటునకు సార్వభౌమునందును బ్రిటిషు దేశము నందును గల ప్రేమను వెల్లడించిరి.

పార్లమెంటు క్రొత్త సభ్యుల కెదురుగా నా వేదికపై దేదీప్యమానముగాఁ బ్రకాశించు నాసనములపై రాకుమారుఁడును, రాకుమారియుఁ గూరుచుండిరి. ఎన్నికలలో గెల్చియప్పుడే పార్లమెంటు సభ్యులుగాఁ బ్రకటింపఁబడఁబోవు క్రొత్త ప్రతినిధులా రాజకుమార దంపతు లధిష్ఠించినసభా వేదిక ముందుగూరుచుండిరి. ఆయురాష్ట్రములనేలు గవర్నరు లాప్రభుదంపతుల వెనుకఁ గూర్చుండిరి. కుడి యెడముల సైన్యాధికారులును, నౌకా సైన్యాధికారులును, రాష్ట్రముల లోని రాజకీయవేత్తలు, మంత్రులు మొదలగువారును గూరుచుండిరి. నల్లదుస్తుల యుద్యోగి యొకఁడు లేచి పార్లమెంటు సభ్యులను రాకుమారుఁడు చదువఁబోవు శ్రీ సార్వభౌముని యానతిని వినఁగోరెను. పిమ్మట రాకుమారుఁడు లేచి నిలుచుండెను. ఆసభలోని వారెల్లరులేచి గీతములుపాడిరి. తరువాత నాస్ట్రేలియా గవర్నరు జెనరలీశ్వర ప్రార్థనము జరిపెను. పిమ్మటఁ గ్రొత్త పార్లమెంటు సభ్యులాస్ట్రేలియా పార్లమెంటుగా నేర్పడి, నాఁటినుండి తమ విధులు నిర్వర్తించుటకు సంపూర్ణాధికారము కలవారైరను రాజశాసనమును జదివి యెడ్వర్డుసార్వభౌముని తరపున నాయన పేరఁదానీ పార్లమెంటును బ్రారంభించుచుంటినని యా రాకుమారుఁడు చెప్పెను.

ప్రారంభోత్సవము కొఱకు నిరీక్షించుచున్న యాస్ట్రేలియా దేశవాసు లానందముచే మిన్నుముట్టునట్లు చప్పట్లు

కొట్టిరి. చక్రవర్తిగారర్థము ఫిరంగులు మ్రోగింపఁబడెను. రాకుమారి యొక్క చిన్నగుండీని నొక్కి యాసంతోషవార్త నాస్ట్రేలియాలోని పాఠశాలలకుఁ దెలిపి వారిచే బ్రిటిషువారి పతాకము లెత్తించుటయే గాక తమపై నిడిన భారమును జయప్రదముగా నిర్వహించితిమని లండనులోనున్న యెడ్వర్డు సార్వభౌమునికిఁ గూడ దెలిపెను. అప్పుడు జార్జిప్రభువు "నాహృదయ మీ సంతోష సమయమున మీతోనున్నది" యని సార్వభౌముఁడిచ్చిన సమాధానముం గూడఁ జదివెను. పిమ్మట నా సమావేశము జనుల కరతాళముల మధ్య ముగిసెను.

తరువాత నాస్ట్రేలియాలోఁ గొన్ని పరగణాలు సందర్శించి యారాజకుమార దంపతులు న్యూజీలాండునకేగి, 17 దినములందుఁ గడపి జూను నెల 17 వ తేదీని బయలుదేఱి టాస్మేనియా దేశములోని "హొబార్టు" నగరమునకు వెళ్లిరి.

తరువాతఁ బెక్కుదేశములు తిరిగి వారు దక్షిణాఫ్రికాకు వెళ్లిరి. అందింకను యుద్ధపుటగ్ని చల్లారలేదు; అందుచే నెట్టి స్వాగతము జరుగునోయని యెడ్వర్డు సార్వభౌముఁడు భయమందెను. బోయరులు బ్రహ్మాండమగు బ్రిటిషు సామ్రాజ్యముతోఁ బోరుట నిరర్థకమని యిప్పటి కింకను

గ్రహింపలేదు. అందుచే నప్పుడప్పుడు వారు తిరుగుఁబాటులు చేయుచుఁ బరాభవ మందుచుండిరి. అట్టి తరుణములో రాకుమారునంపుట యోడిన వారిని బరాభవించి నట్లుండు నని యింగ్లండులోఁ బెక్కురు తలంచిరి. ఎడ్వర్డు సార్వభౌముడు మొదటసందేహించెను. కాని, తరువాత దీర్ఘముగా నాలోచించి రాకుమారుని పోకవలనఁ గీడురాదనియు దీర్ఘదృష్టిగల తన కుమారుఁడు సమయోచితముగాఁ బ్రవర్తింపఁ గలఁడనియుఁ దలంచెను. రాకుమారుఁడటకు వెళ్ళుటయే మేలాయెను. నెటాలు వారును, కేప్‌కాలనీ వారును గొప్ప స్వాగతములొసంగిరి. మఱియు నాపోరులలో బ్రిటిషువారి పక్షమునఁ బోరిన వారికిఁ గృతజ్ఞతను వెల్లడించి వారి సానుభూతిని నిలుపుకొనుటయు నవసరమైయుండెను. అది శ్రీ రాకుమారుని పోకచే సిద్ధించినది.

తరువాతఁ బెక్కుదేశములు సందర్శించి యా ప్రభు దంపతులు కనడాలోని "క్వెబెకు" పురికేగిరి. ఆ పురాధ్యక్షుఁడు విన్నపపత్రికను సమర్పించి "ఈ రాష్ట్రమునందు ఫ్రెంచివార మెక్కుడయినను, మేము మతము నందును, భాషయందును వేఱుపడిన వారమైనను కనడా ఫెడరేషనునందు సంతసముతో నివసించుచుంటిమనియు బ్రిటిషు సామ్రాజ్యమునందు భక్తి కలవారమనియుఁ దమకు విన్నవించుకొనుచుంటిమి" అని చెప్పెను.

క్వీబెకునుండి శ్రీ ప్రభు దంపతులు కనడాలోని మాంట్రియలునకు వారికొఱకుఁ బ్రత్యేకముగా నిర్మింపఁ బడిన ట్రెయినులో వెళ్ళిరి. బహుశః ఆ రైలు బండ్ల వంటి సొగసగు రైలుబండ్లు నేఁటివఱకెందును నిర్మింపఁ బడ లేదు. రాకుమారునకును, రాకుమారికిని బ్రత్యేకముగా నేర్పఱచిన రైలుబండ్లకు "కారిడారుబండి" యనియు "యార్కు బండి"యనియుఁ బేరులుంచిరి. ఆ ట్రెయినులో వేఱొక బండిని రాజవైద్యునకుఁ బ్రత్యేకించిరి. అందు వైద్యులకు గావలసిన సర్వవస్తువులును సిద్ధముగా నుండెను. అవిగాక మఱి యాఱు రైలు బండ్లు రాజమిత్రులకును, బరిజనములకును బ్రత్యేకింపఁబడెను. ఇట్లా రైలు ప్రత్యేకము శ్రీ రాజకుమారుల కొఱకుఁ బ్రపంచములో నిస్సమానముగా నిర్మింపఁబడి చాల మనోహరముగానుండెను.

వారు తరువాతఁ గనడాకు ముఖ్యపట్టణమగు "ఒటావా" కేగిరి. ఒటావా చాల రమ్యమగు పట్టణము. అది యున్నతమగు పీఠభూమిపై రెండు బ్రహ్మాండములగు ప్రవాహములనడుమ నుండును. మహోన్నతములై యాకసమంటుచుండు నొటావా ప్రభుత్వపు భవనములనుండి చూడ దగినంత దూరములోనుండి యవి యాపట్టణమున కెంతో సౌందర్యమును గూర్చుచుండును. ఆపట్టణము చుట్టును బ్రహ్మాండములగు నడవులుకలవు. వానినుండి వచ్చెడి ఱేకుకలపను

గోసి పలకలుగను, నిండ్ల పరికరములకుఁ బనికివచ్చు ముక్కలుగను జేయుటకు ఫ్యాక్టరీలుకలవు. అందుచే నది గొప్ప వర్తక స్థానముకూడనై ప్రపంచములోని చూడఁదగిన పట్టణములలో నొకటియైనది. యార్కు ప్రభు దంపతులందుఁ బార్లమెంటు భవనములుకల కొండమీఁద విక్టోరియా చక్రవర్తిని విగ్రహామునకుఁ బ్రారంభోత్సవము నెఱపిరి.

తరువాత, వారు కనడాలోఁజూచిన విశేషములలో నెల్ల నయాగరా జలపాతములు శ్రీవారి కత్యంతానందము కల్గించెను. వాని సౌందర్యము వర్ణనాతీతము. సంవత్సరమునకు సరాసరి యిరువది లక్షలమంది చొప్పున నెల్లి యారమ్యదృశ్యములు సందర్శించి వచ్చుచుందురన్నచో వాని సౌందర్యమును గొంతకుఁ గొంత మనముగ్రహింపవచ్చును. అది రెండుభాగములుగాఁజీలియుండును. అందుఁ బెద్దదానిని "కనడాజలపతన"మందురు. అది 158 అడుగుల యెత్తునుండి పడుచుండును. రెండవదానిని "అమెరికా జలపతన"మందురు. అది 167 అడుగుల యెత్తునుండి పడుచుండును. క్రింద నయాగరానది బ్రహ్మాండమగు వేగముతో సుళ్ళు తిరుగుచుఁ బోవుచుండును. వానిసహజ సౌందర్యము నశింపకుండుటకు ఆజలపతనముల శక్తి నార్థిక లాభముల కొఱకు ఫ్యాక్టరీలు మొదలగు వానికి వాడకుండఁ గట్టుబాట్లుచేసి యమెరికా కినడా గవర్నమెంటు లొ సంధిపై సంతకములుచేసి యా జలపాతములను రక్షించుచున్నారు.

అక్కడ సాయంకాలము లందు సౌందర్యము కొంతకొంత రంగుతర్వాత వేఱొకరంగు వచ్చునట్లు 144 కోట్ల మైనపు వత్తుల కాంతిగల 24 బ్రహ్మాండములగు సర్చిలైట్లను వెల్గించుచుందురు. ఆ సాయంకాలములందా వింత వింత రంగుల దీపముల వెలుతురునందా జలపతనములు భూమికిఁ దిగివచ్చిన స్వర్గలోక ఖండములట్లు కన్పట్టును. వాని సౌందర్యముతోఁ బోల్చుటకుఁ బ్రపంచములోని యే యితర దృశ్యముకాని సమానము కాఁజాలదు.

అది లోకములోని గొప్ప యద్భుతములలో నొక్కటి యగుట చేతను, నయాగరా పట్టణ సమీపమున నుండుట యే గాక సర్వ ప్రయాణ సౌకర్యములు, భోజన సౌకర్యములు నుండుట చేతను బుణ్యతీర్థమును వలె దానిని లక్షల కొలఁది జనులు పోయి చూచి యానందించి వచ్చుచుందురు. అంత జనమే యితర సృష్టి వైచిత్ర్యమును జూచుటకును బోవరని చెప్పవచ్చును.

తరువాతఁ గనడాలోని రాష్ట్రములోఁ బెక్కు భాగములకేగి, యందందుఁ జూడఁదగినవానిని సందర్శించిన పిమ్మట నా ప్రభుదంపతులు "న్యూఫౌండులాండు"ను వీక్షించి, యట్లాంటిక్ మహాసముద్రము మీఁదుగా మొత్తము నలువది యైదు వేలమైళ్ళ దూరము ప్రయాణముచేసి, నవంబరు నెల మొదటి తేదీనాఁటి కింగ్లాండులోని "పోర్ట్సు మౌతు" రేవునకుఁ జేరిరి.

ఎడ్వర్డు సార్వభౌముఁడును నలెగ్జాండ్రా రాజ్ఞియుఁ దమ మనుమలగు నాప్రభు దంపతుల బిడ్డలను వెంటఁగొని వెళ్లి "వైటు" అనుద్వీపముదగ్గఱఁ గొడుకును, గోడలిని గలిసికొనెను. ఎనిమిది మాసములు సముద్రప్రయాణ ములలోనుండి యింటికివచ్చుచున్న తల్లిదండ్రులను బ్రహ్మా నందముతో బిడ్డలు కలిసికొనిరి. మూఁడు మహాసముద్ర ముల మీఁదుగా నయిదు ఖండములందు జయప్రదముగాఁ బ్రయాణముచేసి వచ్చిన యాయార్కు ప్రభు దంపతులను దండ్రి కౌఁగిలించుకొని యభినందించెను.

ఈ ప్రయాణము బ్రిటిషు సామ్రాజ్య సౌష్ఠవము నకుఁ జాలఁ దోడ్పడెను. అయిదు ఖండములందుఁగల బ్రిటిషు జాతివారొక్క చక్రవర్తియొక్క నీడలో నొక్కదేశము వారి వలె నైకమత్యము కలవారైరి. వివిధ దేశములలోని కాల నీల వారు తల్లిదేశము నందలి నౌకా సైన్యబలమును దమబలముగా భావించి యెట్టి యుద్ధము వచ్చినను భయము లేదను ధైర్యము కల్గియుండిరి. బ్రిటిషు సామ్రాజ్య మయిదు ఖండములందును గాలనీలు కలిగి వాని నన్నిటిని రక్షించుటకుఁ గావలసిన యైశ్వర్యము, సైన్యసమూహములు, నౌకాదళములు కలిగి ప్రపంచములో నేఁటివఱకును గల సామ్రాజ్యములలో నెల్ల నగ్రేసరమై తన కాలనీల వారిని

గన్నబిడ్డలనుబోలె రక్షించుకొనుచు నద్వితీయ ఖ్యాతిని గాంచెను.

ఇంగ్లండు నేలిన పూర్వపు రాజులకంటె జార్జి చక్రవర్తి కాలనీ లన్నిటియందును బ్రేమపాత్రుడాయెను. 12, 13 సంవత్సరముల వయస్సులో నొక్కసారి యా యా స్థానములకేగి యందందుఁ గల గొప్ప రాజకీయ వేత్తలను, భవిష్యత్తునందు గొప్పవారు కాఁదగిన యువకులను జూచి వారి వారి భావములెఱిఁగి వారితోఁ గలిసిమెలసి యుండి యా ప్రజలలో నొకఁడుగా మెలఁగెను. మఱియు నతనికి వివిధ దేశములలోనున్న జాతి స్పర్ధలు, గృహచ్ఛిద్రములు మంచి చెడ్డలు సర్వముఁ దెలియును. అంతేగాక తన ప్రేమ పూరిత మగు హృదయముతో నాయా దేశములలోని రాజకీయ వేత్తలందఱ మనములనతఁడు చూఱఁగొనెను. అతఁడట్లుఁ తన సామ్రాజ్యములోని యన్ని భాగముల వారి యందును "రాజు చూచుటకు వీలులేని దైవ"మను భావము నశింపఁజేసి, "రాజు మన మధ్యనుండి మన కష్ట సుఖములందుఁ బాలుగొను ప్రేమ మూర్తి"యను భావమును వ్యాపింపజేసి బ్రిటిషు సామ్రాజ్యమును స్నేహముతోను, ప్రేమతోను, బంధింపఁ గల్గెను. ఇట్టి నూతన శకమును జార్జిసార్వభౌముఁడు తఱచుగా నైదు ఖండములకును శ్రమయనక, సముద్ర ప్రయాణ మాపదలకు

హేతువనక, నిర్భయముగాఁ గష్టములకోర్చి వెళ్ళుట చేతనే నిర్మింపఁ గలిగెను. అతని పోకచే విముఖులుగా నున్న యాఫ్రికాలోని బోయరుల వంటివారు కూడ సుముఖులై క్రమముగా బ్రిటిషు సామ్రాజ్యమున కంకితులైరి. "బ్రిటిషుసామ్రాజ్యమేకచ్ఛత్రము క్రిందనుండు నేకరాజ్య"మను నంతటి గాఢమైత్రిని జార్జి సార్వభౌముని యీ ప్రయాణ మతని సామ్రాజ్య వాసులలోఁ గల్గించుటకుఁ దోడ్పడినది.

# పదుమూఁడవ ప్రకరణము.



## విశ్రాంతి : సామ్రాజ్య సేవ.

జార్జిసార్వభౌముఁడు నేఁటివరకు బ్రిటిషు సామ్రాజ్యమునకుఁ జేసిన నిరుపమానమగు సేవను బ్రజలు గుర్తించి యాప్రయాణానంతర మతనికి విందులపై విందులు జరిపి యింగ్లాండులోని ప్రజలు వారి సంతసమును వెలిపుచ్చిరి.

ఇంతలో నవంబరు 9వ తేదీని నెడ్వర్డు ప్రభుని జన్మదినోత్సవము వచ్చెను. బ్రిటిషు ద్వీపములలోని జనులెల్లరు, నెప్పుడు జార్జిరాకుమారుని వేల్సుప్రభువుగాఁ బ్రకటింతురా యని యువ్విళులూరుచుండిరి. వేల్సుప్రభువనఁగా సామ్రాజ్యమునకు "తరువాతి యారసుఁడు" అనియర్థము. ఎడ్వర్డుచక్రవర్తి పట్టాభిషేకమైన వెంటనే జార్జికుమారుని వేల్సుప్రభువుగాఁ జేయునని భావించిరి. కాని యాతఁడట్లు చేయలేదు. పెక్కుదినములుగడచినవి. నెలలుగడచినవి. కాని యింతవఱకాగౌరవము నెడ్వర్డు చక్రవర్తి కుమారున కీయలేదు. అయినను నది చక్రవర్తి ప్రత్యేకపు హక్కు. నేఁడు సామ్రాజ్యమునందెల్ల మెడలనుదిరిగి సామ్రాజ్యమున కెక్కుడు సౌష్ఠవమునుగూర్చిన జార్జికుమారుని సేవను దండిప్రగుఱితింపక తప్పినదికాదు. అందుచేఁ దుదకు బెక్కు మాసములు గడ

చిన వెనుక తన జన్మదినోత్సవము నాఁడాతనిని వేల్సుప్రభు వుగాఁ జక్రవర్తి ప్రకటించెను.

జార్జి రాకుమారుఁడు వేల్సు ప్రభువయిన తరుణమున లండను వాస్తవ్యు లొసంగిన గొప్ప విందులో నతఁడు ప్రసంగించిన ప్రసంగములో బ్రిటిషు సామ్రాజ్యము నెడల సామ్రాజ్యములోని వివిధ భాగముల వారికి నెట్టి భక్తి యుండెనో తెలుపుచునిట్లు వెల్లడించెను.

"ఈ నాప్రయాణమునందు నాకు ముఖ్యముగాఁ దట్టిన విషయ మేమియనఁగా సామ్రాజ్యములో నెల్ల యెడలనుండు కాలనీల వారికిఁ దల్లిదేశము నెడఁగల ప్రేమ పెంపు. అందుచే మనసామ్రాజ్యమునందుఁగల ప్రధానభావ మందుఁజేరిన వివిధ దేశములవారికిఁ జక్రవర్తిగారి యెడఁగల రాజభక్తి యని నేను మీకు నిస్సందేహముగాఁ జెప్పగలను. అదినా కాష్ట్రేలియాయందు వ్యక్తమైనది. న్యూజీలాండు నందు వ్యక్తమైనది. ఆసియాఖండమునందు వ్యక్తమైనది ఆఫ్రికా ఖండమునందు వ్యక్తమైనది. అమెరికా ఖండము నందు వ్యక్తమైనది. చిన్న దీవులందు వ్యక్తమైనది. పెద్ద దీవులందు వ్యక్తమైనది. ఇంత యేల యయిదు ఖండములలో మన సామ్రాజ్య మెందెందుఁ గలదో యందెల్ల నాభావము నాకు స్ఫుటముగా గోచరించినది. అంతేకాదు

సెంటూలూయి మారిషసుల వంటి ఫ్రెంచివారి యాధిక్యము గల పురములందుఁ గూడ బ్రిటిషు సామ్రాజ్య భక్తి కలదు. మఱి బోయరులు కూడఁ బోరి పోరి నేఁడు మన సామ్రాజ్యములో లీనమై సామ్రాజ్యము నెడల భక్తిఁ జూపుచున్నారు. ఇదియే నాకీ ప్రయాణములందుఁ గన్పట్టిన ప్రధానవిషయము"

అట్లే సామ్రాజ్యావసరములను గూర్చి యుపన్యసించుచు వారిట్లు చెప్పిరి. "సామ్రాజ్యములోను, బ్రపంచమునందును గొప్పవర్తకము చేయుచున్న బ్రిటిషు వర్తకులకు నేను చెప్పవలసిన దేమనఁగా: విదేశీయుల పోటీని గుర్తించి తదనుగుణముగా మీరు వర్తక పద్ధతులలో మార్పులు చేసికొన వలయును. అభిమానముచే సామ్రాజ్య వాసులచే హెచ్చుధరలకు వస్తువులను గొనునట్లుచేయుట వర్తక సౌష్ఠవమునకుఁ దోడ్పడఁ జాలదు.

మఱియు వస్తువులను గొనువారలు కూడ ముఖ్యముగా గమనింపవలసిన విషయ మొకటికలదు. అది యేదియనఁగా: సామ్రాజ్యములో దొరకు వస్తువు లున్నపుడు సామ్రాజ్యేతర దేశవాసుల వస్తువులను గొనుట మన సామ్రాజ్య భావమును నాశముచేయుటయే. సామ్రాజ్యము పరస్పర ప్రేమగల యొక పెద్దకుటుంబము వలె నుండవలయును. అందొకరు చేయఁజాలని వస్తువును రెండవవారిదగ్గఱఁ

గొనుచున్నచో నుభలయులకును లాభముకలుగును. అట్లు గాక "మావస్తువులను మీరుకొనుఁడు. మీావస్తువులను మేము కొనఁజాలము" అను పద్ధతిని నవలంబింతురేని యది సామ్రాజ్యములోని కాలనీల వారి యసంతృప్తికి హేతువగును. ఈ భావము కాలనీలలో సర్వత్ర వ్యాప్తినొందినది. దీనినింగ్లాండు లోని వర్తకులు గమనింపవలయును.

సామ్రాజ్యములో నంతటనుగల మఱియొక వాంఛను మీాకుఁ దెలియఁజేయుచుంటిని. నేను వెళ్లిన ప్రదేశము లం దెల్ల జనసంఖ్య తగినంతమంది లేరను భావముకలదు. బ్రహ్మాం డమగు నాస్ట్రేలియా ఖండములోఁ దమజనసంఖ్య దేశమునకుఁ జాలరనుభావము హెచ్చుగాఁగలదు. అందిప్పటికంటె నెన్ని యో రెట్లుమంది హాయిగా సర్వసౌఖ్యములుకలిగి జీవింపవచ్చు ను. అందు ధనధాన్యములు మనుజులకుఁ గావలసినపండ్లు, పాడి పుష్కలముగాఁ గలదు. ఇంగ్లాండులో వసతి తక్కువగానుండు వారు, లేదా విదేశములకేగి యందు ధనవంతులై సుఖము లందఁగోరు వారట్టి దేశమునకేగి యున్నతి నంద రాదా? కన డా దేశమునందుగూడఁ బ్రజలింకను నెక్కుడుగాఁగావలయున ను వాంఛకలదు. కనడాలో సరిగా వ్యవసాయముచేసినచో నది సామ్రాజ్యమున కంతటికిని గావలసిన గోదుమలను బండింపఁ గలదు. మఱియు నా దేశములో విశాలములగు నడవులు కలవు. బ్రహ్మాండములగు గృహములు, సౌధములు నిర్మింపఁ

దగిన కలపను సామ్రాజ్య మంతటికి నా దేశమునుండి యెగుమతి చేయవచ్చును. ఇట్లు, విదేశములకేగి ధనవంతులగుటకవకాశము లుండఁగా నున్న దేశములోఁ బీదలై యుండుట సామ్రాజ్య సౌష్ఠవమునకుఁ దోడ్పడదు.

జనులు చాలని లోటు క్రొత్త కాలనీలలోనే గాక ప్రాత కాలనీలలో గూడఁ గలదు. ఆఫ్రికాలోని కాలనీలలోఁ గూడ జనులెక్కుడుగాఁ గావలసియున్నారు. మన కాలనీలలోఁ బెక్కు చోట్ల లోహపు గనులు కలవు. సామ్రాజ్యము లోని సర్వ సంపదల నుపయోగించు కొని యైశ్వర్యవంతుల మగుటకు మనకుఁ భగవంతుఁ డొసఁగిన యవకాశములను మనము వినియోగించుకొనుటవసరము.

నేను వెళ్లిన కాలనీల యందెల్లెడల నొకటే కేక వినఁబడు చున్నది. మాకుఁ దగినంతమంది మంచి జనుల నంపుఁడని కాలనీల వారడుగు చున్నారు. అందుచే నేను మిమ్ములను గోరున దేమనఁగాఁ దల్లి దేశమునుండి తగినంత మంది యోగ్యులగు వారలు వలసపోయి సామ్రాజ్యములోని యవకాశముల నెల్ల వినియోగించుకొని సామ్రాజ్య భాగములను బలిష్ఠములుగను, బరస్పర ప్రేమగల వానిని గనుజేసి మన తండ్రులు, తాతలు నిర్మించిన యీ గొప్ప సామ్రాజ్యమును బూర్వము కంటెఁ బ్రబలతరమగు దానినిగా మనము చేయవలయును.

---

# పదునాలుగవ ప్రకరణము.



## ఎడ్వర్డుప్రభువు పట్టాభిషేకము.

1902 వ సంవత్సరమున జూనునెల తుదిరోజులలో నెడ్వర్డు చక్రవర్తి పట్టాభిషేక మహోత్సవము జరుపుటకు నిశ్చయింపఁబడెను. అందు కొఱకు సామ్రాజ్యము నందలి యన్ని భాగములవారును దగిన ప్రయత్నములు చేయుచుండిరి. ఇంగ్లాండు ప్రజలు చేయు యత్నములకు మేరయే లేదు. కాని యెడ్వర్డు ప్రభువు మనస్సు నందొక బాధకలదు. బోయరుల యుద్ధము ముగిసిన తరువాతఁ బట్టాభిషేకము జరిగినచో బాగుగానుండునని యాతనికోరిక. అందుచే నతఁడా శుభముహూర్తము నాలస్యము చేయుచు రాజీకి విశ్వప్రయత్నములు చేయుచుండెను. "శాంతిస్థాపకుఁడు" అనిపేరు పొందిన యెడ్వర్డు చక్రవర్తికోరిక సిద్ధించెను. యత్నములు చేయఁగాఁ జేయఁగాఁ గార్యములు సిద్ధించును గదా? బోయరులతోసంధికుదిరి సంధి పత్రములమీఁద సంతకములుపడెను.

సంతసముతోఁ బట్టాభిషేకము గావించుకొనుట కెడ్వర్డు చక్రవర్తి సర్వ ప్రయత్నములును జేయుచుండెను. కాని యతనికిఁ గడుపులోఁ బురీష కోశమునకు సంబంధించిన

వ్యాధియొకటి వచ్చెను. అది పైకిఁ గానరాదు. కాని, యుపేక్షించినచోఁ బ్రాణహాని తప్పదు. అందుచేఁ జక్రవర్తిగారి ప్రాణములను నిలుప వలయునన్న వెంటనే శస్త్రచికిత్స జరుప వలయును. గత్యంతరము లేదు. అది మందులకు లోఁబడు వ్యాధికాదు. శస్త్రముచేసి యా పురీష కోశము నం దేర్పడిన పుండునందుండు చీము మొదలగున వానిని దొలగించి శుభ్రము చేసినఁ గాని రోగి బ్రతుకఁడు. అందుచేఁ బట్టాభిషేకమును నిలుపుదల చేసి శ్రీ చక్రవర్తి గారికి శస్త్రచికిత్స చేసిరి.

దైవవశముచే గలిగిన యీ విఘాతమునకు బ్రిటిషు దేశీయులును, సామ్రాజ్యములోని వివిధ ప్రాంతములవారును జాలనొచ్చుకొనిరి. ఎడ్వర్డు చక్రవర్తియెడఁ బ్రజల కెంత ప్రేమ కలదో తెలిసికొనుట కీయాపదతోడ్పడెను. ఇంగ్లండునందును, సామ్రాజ్యమునందునుగల చర్చిం లోను, మసీదులలోను, దేవాలయములలోను బ్రజలు ప్రార్థనలుసలిపి యెడ్వర్డు చక్రవర్తి కారోగ్యమును బ్రసాదింపుఁడని యీశ్వరుని బ్రార్థించిరి.

తరువాత రోగము నెమ్మదించెను. ఎడ్వర్డుసార్వభౌముని పట్టాభిషేకము గొప్పవైభవముతో జరిగెను. తన రాజ్యకాలములో నెడ్వర్డు శాంతికొఱకు జాల బ్రయత్నములు చేయు

చుండెడివాఁడు. అతఁడు దాదాపుగా యూరపుఖండములోని దేశముల కన్నిటికిని వెళ్లి యా యా దేశపు రాజులతోడను జక్ర వర్తులతోడను జెలిమిచేసి వారి నింగ్లండునకు మిత్రులుగా ద్రిప్పుకొనుటలో కాలమువినియోగించెను. అందుచే రాజులు తమ ప్రజలను స్వయముగాఁ జూచుటచేఁ గలుగు లాభము లను చక్రవర్తి యెఱిఁగి యుండెను. తన కుమారుఁడు సామ్రా జ్యములోని కాలనీల కేగి యెట్లువారిలో సామ్రాజ్యభక్తిని బురి కొల్పనో యెడ్వర్డు చక్రవర్తి యెఱిఁగి యుండెను.

పోరాటముల మధ్యనున్న బోయరులు కూడఁ దన కుమారుని పోకచే నెట్లు శాంతి వహించి యతనికి స్వాగత మొసంగిరో యెడ్వర్డు చక్రవర్తి చూచి యుండెను. అందుచేఁ దన కుమారుని సామ్రాజ్యస్థులగు స్వదేశ రాజులలోఁ గూడ సుహృద్భావము కలిగించుటకుఁ బంప నెంచెను.

కుమారుఁ డిదివఱకు రెండు గొప్ప ప్రయాణములు చేసినను హిందూదేశమునకుఁ బోయి యుండలేదు. కావున నాతని నీతూరి హిందూదేశమునకుఁ బంపి యచ్చటి స్వదేశ సంస్థానాధీశ్వరులయుఁ బ్రజలయుఁ బ్రేమను సంపాదించి భారత భూమిలో సామ్రాజ్యమును సుస్థిరము చేయ నెంచెను.

అందుచేఁ దనమంత్రులతో నతఁడీవిషయమై యాలోచింపఁగా వారికిఁగూడ నట్టిభావమే యుండెను.

హిందూదేశము నుండి యప్పటి రాజ ప్రతినిధి కూడ యువరాజు హిందూదేశమునకు వచ్చు టవసరమని యాహ్వానము నంపెను. తన కోరికయు, మంత్రుల యభీష్టమును, హిందూదేశపు రాజప్రతినిధి గారి వాంఛితమును నొకేసారి చక్కఁగా నేకీభవించెను. అందుచే వేల్సు ప్రభువును హిందూదేశమునకుఁ బంపుట కెడ్వర్డు చక్రవర్తి నిశ్చయించెను.



# పదునైదవ ప్రకరణము.



## హిందూదేశపు మొదటి ప్రయాణము.

శ్రీ యువరాజ దంపతులు 1905 వ సంవత్సర మక్టోబరు 19వ తేదీనాఁడు లండనులోఁ బ్రయాణమై నవంబరు నెల 9 వ తేదీని బొంబాయిలో దిగిరి. అక్కడనుండి రైలుమీఁద నుత్తర హిందూదేశమందలి స్వదేశ సంస్థానములలో నొకటియగు "ఇందూరు"నకుఁబోయి యాహ్వాల్కారు భూపాలుఁడొసంగిన నిరుపమానములగు సన్మానము లందిరి. పిమ్మట నచటికి సమీపమునంగల "ఉదయపూరు" అను స్వదేశ సంస్థానముం దిలకించి సంతసించి, యావల వారు "జయపూరు" అను రాజపుత్ర సంస్థానమున కేగిరి.

తరువాత పడమటి సరిహద్దు పరగణాలయందలి సైన్యబలములను సందర్శించుటకు శ్రీ యువరాజదంపతులు లాహోరున కేగిరి. అక్కడ వేలకొలఁది సైనికులు బారులు తీర్చి నిలిచి యువరాజ దంపతుల గౌరవార్థము వినోదములు సలిపిరి. మఱియు నందు హైందవదేశీయులకును, దెల్లవారికిని నిచ్చు సైనికశిక్షనుగన్గొని యానందమందిరి. ఆపరగణాల సమీపములోనుండు నడవిజాతులవారు చేయుచుండు దుండగముల నణఁచుటకొఱకు సైనిక శాఖవారుచేయు ప్రతిక్రియల విధానము లన్నిటిని జూచియు, నెఱేఁగియు నడప

దడప మూఖ్ఖరులచే బాధల నందుచున్నను నా సరిహద్దులు సురక్షితముగనే యున్నవని తెలిసికొని, సంతసముతో వానిని విడిచి, హిమాలయములలోని కొన్ని సౌందర్య ప్రదేశముల కేగి వానింగాంచి సంతసించిరి. తరువాత సిక్కులకుఁ బుణ్యస్థలమగు నమృతసరు పట్టణమును సందర్శించి ఢిల్లీకి వెళ్లిరి.

హిందూదేశములో ఢిల్లీ ప్రాచీన నగరమనియు, నైదాఱువేల సంవత్సరముల నుండి హిందూ దేశమునకుఁ బ్రధాన నగరమనియు, హిందూభూపాలకుల పిమ్మట మహమ్మదీయ భూపాలకులు దానినే హిందూ సామ్రాజ్యమునకు రాజధానిగాఁ గైకొని రనియు, నాపద్ధతినే యిప్పుడు బ్రిటిషు పాలకులు కూడ ననుసరించు చుండిరనియుఁ దెలిసి శ్రీ యువరాజ దంపతులు సంతసించిరి.

ఆగ్రాకేగి ప్రపంచములోని యేడు చిత్రములలో నొకటియగు "టాజ్ మహాలు"ను జూచి యానందించిరి. అది చలువ ఱాలచే నిర్మింపఁబడి భూలోకమునందు వెలసిన దివ్యప్రాసాదముంబోలి సొంపులు కురియు చుండును. యమునానదినుండి వెడలివచ్చు చిన్న నీటికాలువ యొకఁడందలి చిన్న సరస్సును నీటిచేనింపి, పొర్లి సెలయేఱుగాఁ బాఱి, యాటాజ్ మహాలు నావరణములో నంతటను దెఱపిలేక క్రిమ్మిన పచ్చికందడిపి, దానిని జిగురింపఁ జేయుచు ముక్కాఱులందు నద్దానిఁ బచ్చగానుంపఁ, గనులకుఁ బండువుగానుండు పెద్ద యావరణముతోఁ గూడిన యా మందిరము లోకము

లోని రమ్యదృశ్యములకెల్ల దలకట్టుగా నొప్పుచుండును. సంపూర్ణ చంద్రోదయ వేళల నా రమ్యదృశ్యముం జూచువార లద్దానిని దప్పక స్వర్గ ఖండముగనే భావింతురు. అట్టి దృశ్యముం జిత్తగించి శ్రీ యువరాజ దంపతు లానంద పరవశులైరి.

పిమ్మట వారు గ్వాలియరు మహారాజాగారి నగరమునకేగి యద్వితీయమగు వారి స్వాగతముంజూచి హర్షించిరి. తరువాతఁ గల్కత్తా నగరమేగి యటనుండి బంగాళా వియుక్తాగుడము మీఁదుగా రాజోచితములగు నుత్తమ నౌకలపైఁ బ్రయాణముచేసి రంగూనునగరముం దిలకించిరి. వివిధ దేశముల జనులతోనిండిన రంగూను నగరమువారి హృదయములం గరంచెను.

రంగూనునుండి మాండలేకేగి యటనుండి మరల బంగాళా వియుక్తాగుడమును దాటిమద్రాసు నగరమునకు వచ్చిరి. ఆ పిమ్మట మైసూరు రాష్ట్రమున కేగి హిందూదేశములోని స్వదేశ సంస్థానాధీశులలో నెల్లఁ బ్రజలచే నెక్కుడుగాఁ బ్రేమింప బడుచున్న యారాజర్షిని, నతని యుదార ప్రభుత్వమును, నిరుపమానమగు స్వాగతమును గాంచి పులకాంకితుఁడాయెను. పిమ్మట నా యువరాజు నా మైసూరు భూపాలకుని రాష్ట్రమునంగల బెంగుళూరును సందర్శించి యచటికిఁ గొలఁది దూరములో నున్న యడవిలో నేనుఁగులను వేఁటాడి యద్వితీయమగు నానందము నొందెను.

తరువాత వేల్సుప్రభువు సతీమణితోఁ గూడ స్వదేశ సంస్థానములలో నెల్లఁ బెద్దదియగు హైదరాబాదు రాష్ట్రమునందలి ప్రధాన నగరమున కేఁగి, నైజాం ప్రభువొసంగిన యద్వితీయ మగు స్వాగతముచేనలరి, యచ్చటికి సుమారు పదునైదు యోజనములలోఁ గల యడవులందున్న వివిధములగు మృగములను వేఁటాడి, హిందూదేశమునందలి వేఁట పద్ధతుల నెఱిఁగి సంతసించి, పిమ్మట బొంబాయి రాజధాని యందలి యెల్లోరాగుహల కేగి యందలి చిత్రములను దిలకించి, హిందూదేశములోని నగరములలోఁ బవిత్రమగు కాశీ కాపురి కేగి యా దివ్యస్థల విశేషంబులెల్ల నెఱింగి, నేపాళ దేశంబునకుఁబోయి యా దేశము నేలు బీగము సాహెబా యాతిథ్యముంగొని, యామె పరిపాలనమునందలి విశేషంబు లరసి, హిమాలయోన్నత భూములందు సుందరముగా నొప్పారు సిమ్లానగరముంజూచి క్రమ్మఱివచ్చి, క్రొత్తగా నభివృద్ధినందుచున్న సముద్రపు రేవగు కరాచీని సందర్శించి, హిందూదేశపు సౌందర్యమునకు రాజభక్తికి నానందమంది, తనయొక్కయుఁ దన రాజ్ఞియొక్కయు సంతసమును భారతీయుల కెఱిఁగించి, మధ్యధరా సముద్రముమీఁదుగా నింగ్లండునకుఁ బ్రయాణమై మే నెల 8 వ తేదీకి లండను నగరమునకుఁ జేరెను.

---

# పదునాఱవ ప్రకరణము.



## విదేశ సంచారము : తండ్రికిఁ దోడ్పాటు.

1906 వ సంవత్సరము మే నెల 26వ తేదీని వేల్సు యువరాజు తన సతీమణితోఁగూడి మాడ్రిడు పట్టణమునకు "అల్ఫాన్సో" రాజు వివాహమును సందర్శింపనేగెను. వధువు బాటెను బర్గునకుఁ జెందిన "ఈనా" అను నామె. ఆవివాహము చాల వైభవముగా జరిగెను. దంపతులు మాడ్రిడు నగరములో నూరేగుచుండిరి. యువరాజ దంపతులు వారి వెనుక నూరేగింపులో నుండిరి. అట్టి సమయములో విప్లవకారుఁడగు "మెటియో మోరలు" అను దుష్టుఁడొక పెద్ద బాంబునా యూరేగింపులోనికి విసరెను. అది చాల గొప్ప బాంబు. అందుచే నిరువది మంది చచ్చిరి. మఱియు నేఁబది మందికి దెబ్బలు తగిలెను. అంతేకాక, యా పెండ్లికుమారుఁ డెక్కిన బండిగుఱ్ఱములలో నొకటి చచ్చిపోయెను. అదృష్టవశమున నా దురాత్ముఁడు చంపనెంచిన యా పెండ్లికుమారునకుఁగాని పెండ్లికొమారితెకుఁగాని యేవిధమగు దెబ్బలుకాని తగులలేదు. కాని, యారాకుమారి శరీరమునిండ రక్తము చిందెను. అయినను "ఇనారాజ్ఞి" చలింపలేదు. ఆమె ధైర్యమును గాంచి స్పెయిను ప్రజలు

చాల మెచ్చుకొనిరి. ఆదంపతుల కడనేయున్న మన వేల్సు ప్రభువుగారి కెట్టి దెబ్బలును దగులకుండ దైవము తప్పించెను.

వేల్సుప్రభు దంపతులు యూరపు రాజకుటుంబములందు జరుగు ప్రభుకార్యములకుఁ దఱచు వెళ్ళుచుండెడి వారు. 1906 వ సంవత్సరము జూనునెల 22వ తేదీని నార్వేరాజుగారి పట్టాభిషేకము గొప్ప వైభవముతో జరిగెను. పట్టాభిషేకము జరుపుకొనుచున్న రాజుగారిభార్య మన జార్జి ప్రభువుగారి సోదరియే. అందుచే నారాజదంపతులు వేల్సు ప్రభువునకుఁ జాల సన్నిహితబంధువులు. ఆరాజ్ఞి పేరు మాడ్ రాజ్ఞి. ఆపట్టాభిషేక సమయమునందు మాడ్ రాణి సమీపమునందా యువరాజదంపతులు కూర్చుండి చాలశ్రద్ధతో నాపట్టాభిషేక మహోత్సవమును సందర్శించిరి.

తరువాత రెండు మూఁడు వత్సరములు వేల్సు ప్రభువిట్లు తండ్రిగారు వెళ్ళనక్కఱ లేకుండ రాజ బంధువుల శుభకార్యములకుఁ దానే వెళ్ళుచు నాయనకు శ్రమ తప్పించెను. రాజ్యాంగ సంబంధములయిన కాగితములు చదివి, చూచి, చర్చించి యంగీకరించుటకుఁ జక్రవర్తి దిన దినము చాల కాలము వ్యయము చేయవలసి వచ్చుచుండెను.

ఆ కాలములో కనడాలోఁ బ్రపంచ నౌకాదళ సమావేశము జరిగెను. అప్పుడచ్చటికి నానా దేశములనుండి యుద్ధ

నౌకలువచ్చెను. ప్రతి దేశమును దన దేశము నందున్న గొప్పగొప్ప యుద్ధనౌకలను బంపెను. ఒక్కదినములో లక్షల కొలఁది జనులను నాశము చేయఁగల ఫిరంగులుకల పెద్ద పెద్ద యుద్ధపు టోడలువచ్చి యానౌకాదళ సమావేశము నందు జనసమూహములను గబళించి వేయు బ్రహ్మాండములగు గొప్రత్తరకపు రాక్షసులో యనునట్లు భయంకరములుగా నిలిచెను.

ఆ సమావేశమునకు జార్జిచక్రవర్తి "ఇండోమిటబుల్" అను నోడలో వెళ్ళెను. ఆ నాఁటివఱకుఁ గల గ్రొత్త క్రొత్త యభివృద్ధులన్నియు నందుఁ జేర్ప బడియుండెను. ఆప్రపంచయుద్ధ నౌకా సమావేశమునకుఁ దండ్రిగారు వెళ్ల నక్కఱ లేకుండ జార్జియువరాజు తానేవెళ్లి ప్రపంచము నందేయే దేశముల కెట్టి యుద్ధనౌకలు కలవో, క్రూయి జరులెన్నికలవో, సముద్రాంతర్గాము లెన్నికలవో, యేయే దేశములవారు సంవత్సరమున కెంతెంత ధనమును నౌకా నిర్మాణమునందు ఖర్చు చేయుచున్నారో, యాకాశ విమానములు యుద్ధము లందెంత వఱకుఁ దోడ్ప డునో, వాని నిర్మాణములో నేయే దేశముల వారెంతవఱకు శ్రద్ధ తీసికొను చున్నారో మొదలగు సర్వ విషయములను జర్చించి తెలిసి కొనెను. అంతేగాక ప్రపంచ శాంతిని నెల కొల్పుటకు యుద్ధపరికర నిర్మాణమును దగ్గించు విషయములో

నన్ని దేశములు నంగీకరించి యే యే దేశములు యుద్ధ పరికరముల కొఱకు సంవత్సరమున కెంతెంత ధనమును ఖర్చు చేయనలసి యుండునో నిర్ణయించుట మంచిదికాదా యను విషయమును గూడఁ జర్చించి తెలిసికొని నౌకాదళ బలవిషయము నందు బ్రిటిషు దేశము ప్రపంచము నంగల యన్ని దేశములలో నగ్రస్థానమునందున్న దనియు యుద్ధము వచ్చినను బ్రిటిషు ద్వీపములకుఁ గాని యయిదు ఖండములందును గల బ్రిటిషు సామ్రాజ్య భాగములకుఁ గాని భయ మిసుమంతయును లేదనియు స్వయముగా గ్రహించి సంతోషముతో నింగ్లాండునకుఁ దిరిగి వచ్చెను.

ఇట్లు రాజకీయ ప్రౌఢిమకల్గి స్వతంత్రముగాఁ జర్చించి రాజకీయ విషయములు తెలిసికొను నేర్పుగల వేల్సుప్రభువు వివాహ, పట్టాభిషేకాది శుభకార్యముల కేగుటలో నేగాక నౌకాదళ బల పరీక్ష, సైన్యరక్షణము, విదేశ రాజకీయము తెలియఁగుట మొదలగు కార్యములందును దఁడ్రికిఁ జేదోఁడుగా మెలంగుచు నతనికి బదులు తానే పెక్కుకార్యములు నిర్వహించుచు దండ్రికిఁ దోడ్పడుచుండెను.

---

# పదునేడవప్రకరణము.



## ఎడ్వర్డు సార్వభౌముని మరణము.

1910 వ సంవత్సరము మేనేల 5 వ తేదీ యందెడ్వర్డు సార్వభౌమునికి జబ్బు చేసెనని విని ప్రజలు చాల నాతురపడిరి. అంతకుఁ బూర్వమే యతఁడు కొలఁది రోగముతో నుండెను. కాని, దానిని లక్ష్యము చేయక తన విధిని నిర్వర్తింప వలయునని భావించి యతఁడు రాజకార్యములు చేయుచుండెను. అందుచే జబ్బు చాలఁ దీవ్రమై చక్రవర్తికకస్మాత్తుగాఁ బ్రమాదకరముగాఁ బరిణమించెను.

ఆరోజునఁ బ్రకటించిన రాజమందిర వార్తయందిట్లుండెను. "రాజుగారికి వ్యాధి కలిగినది. అందుచే రెండు రోజుల నుండి వారు తమ గదినుండి వెలుపలికి వచ్చుటలేదు. శ్రీవారిస్థితి యపాయకరముగనే యున్నది.

యఫ్. లేకింగు, యం. డి.
జె. రీడ్, యం. డి.
ఆర్. డౌగ్లాస్‌పవెల్, యం. డి."

ఏడవ తేదీ రోగము మఱింత హెచ్చి స్పృహతప్పెను. మధ్యాహ్నమునకుఁగొంత స్పృహవచ్చి యతఁడు కుటుంబము

లోనివారినందఱను గుర్తించెను. కాని రాత్రియగుచున్న కొలఁదిని మరల స్పృహాతప్పుచుండెను. రాజ మందిరము వెలుపల వేలకొలఁది ప్రజలాత్రముతోఁ గనిపెట్టుకొని యుండిరి. అర్థరాత్రము గడచిన పిమ్మట శ్రీ యెడ్వర్డు చక్రవర్తి ప్రాణము విడిచెను. వెస్టుమినిస్టరు ప్రాసాదమునుండి పెద్దగంట మ్రోగి రాజుగారి మరణవార్తను బ్రపంచమునకుఁ జాటెను.

సార్వభౌముని మరణముచే బ్రిటిషు ద్వీపములు దుఃఖ సముద్రమునందు మునిగి పోయెను. బ్రిటిషు సామ్రాజ్యము నాల్గు భాగముల నుండి దుఃఖమును దెలుపు తంతివార్తలు మితిలేకుండ విండ్సరు రాజ భవనమునకుఁ జేరుచుండెను. సామ్రాజ్యము నందలి ప్రజలెల్లరు దుఃఖించిరి.

బ్రిటిషు ద్వీపములును, సామ్రాజ్యమును మాత్రమే గాక యూరపులోని రాజ కుటుంబముల వారును, దదితర ప్రజలును జాల దుఃఖించి తమ విచారమును రాజకుటుంబమువారికిఁ దెలిపిరి.

రాకుమారులెంత దుఃఖములోనున్నను, రాజులేనిరాజ్యము నుంచుట తగదుకదా? పుట్టెడు దుఃఖములో నున్న జార్జి ప్రభువు వెంటనే రాజ్య స్వీకారము చేయవలసి వచ్చెను. సెంటు జేమ్సు రాజభవనములోని సింహాసనపు గదిలో "పంచమ జార్జి ప్రభు వింగ్లాండునకును, వేల్సు దేశమునకును,

సముద్రముల యావలనున్న బ్రిటిషు డొమినియనులకును రాజనియుఁ, గ్రైస్తవ మత రక్షకుఁడనియు, హిందూదేశ మునకుఁ జక్రవర్తి యనియు" వెంటనే ప్రకటింపఁ బడెను.

మఱియు నారాజ ప్రకటనము నందిట్లు లిఖింపఁబడి యుండెను. "మన మెంతయో ప్రేమించిన శ్రీ సప్తమ ఎడ్వర్డు రాజుగారిని బరమేశ్వరుఁడు తన సన్నిధికిఁ దీసికొని వెళ్ళినందున ఆయన మరణముచే గ్రేటు బ్రిటను సంయుక్త రాజ్యముయొక్కయు, ఐర్లండు యొక్కయు రాజ్యభారము శ్రీ జార్జి ఫ్రెడరిక్ ఎర్నెస్టు ఆల్బర్టు రాకుమారునికి సంక్రమించినది. అందుచే ఆధ్యాత్మిక, ప్రాపంచిక విషయములలో నధికారముగల ప్రభువులమగు మేము దివి కేగిన శ్రీ సప్తమ ఎడ్వర్డు సార్వభౌముల యాంతరంగికులగు ప్రివీకౌన్సిలు వారిసలహాల ననుసరించియు, మఱి దేశములో గణింపఁదగిన యితర పెద్దలతోనను, గా లండను నగరాధ్యక్షుఁడు, సభ్యులు, మఱి యితర పౌరులతోను యోచించియు నేకకంఠముగా హృదయ పూర్వకమును, వాక్పూర్వకమును నగు సమ్మతితో గొప్పవారును బలవంతులును నగు శ్రీ జార్జి ఫ్రెడరిక్ ఎర్నెస్టు ఆల్బర్టుగారిని-గతించిన శ్రీ సప్తమ ఎడ్వర్డు సార్వభౌమునికి శాస్త్రీయమగు నట్టియు, సత్యమగునట్టియు నారసుఁడు కావున-దేవుని కృపచే ఐర్లండు, గ్రేటు బ్రిటనుల సంయుక్త రాష్ట్రమునకును, సముద్రముల కావలనుండు

బ్రిటిషు డొమినియనులకును రాజుగను, క్రైస్తవ మత రక్షకుఁడుగను, హైందవ సామ్రాజ్యమునకుఁ జక్రవర్తిగను బ్రకటించు చుంటిమి. మఱియు నతనికి మేమును బై రాష్ట్రములలో నుండు నెల్లవారమును మనఃపూర్వకమగు ప్రేమతోడను, విధేయత తోడను లోఁబడి యుండుట కంగీకరించి మనలను జిరకాలము సౌఖ్యముగాఁ బరిపాలించునట్లు శ్రీ పంచమ జార్జి చక్రవర్తిగారిని జేయుమని రాజులను, రాణులను భూమిని బరిపాలించునట్లు చేయు భగవంతుని ప్రార్థించుకొనుచున్నాము"

దేవుఁడు రాజును రక్షించును గాక!

ఆప్రకటనముపై సంతకములు చేయఁబడిన పిమ్మటఁ దండ్రిగారి మంత్రివర్గమువారు జార్జిచక్రవర్తిగారికి లోఁబడి యుందుమని ప్రమాణములు చేసి తమసీళ్లను సార్వభౌముని చేతికందిచ్చిరి. శ్రీ వారు వానినిఁగొని మరల వారినే మంత్రులుగా నేర్పఱచినట్లు తెలియుట కెవరి సీలు వారి కిచ్చిరి.

అప్పుడు దుఃఖసముద్రములో మునిగియున్న శ్రీ జార్జి సార్వభౌముఁడు మాట్లాడలేక మాట్లాడలేక యిట్లు చెప్పెను.

"మాకుఁ బ్రేమపాత్రుఁడగు జనకుఁడును, మనకు రాజును నగు శ్రీ సప్తమ యెడ్వర్డు చక్రవర్తిగారు చనిపోయిరను

విషాదవార్తను మీకుఁదెలియఁజేసి కొనవలసివచ్చినది. తీరని యీ గొప్ప దుఃఖము నామీఁదను నా సామ్రాజ్యము మీఁదను తలఁపని తలంపుగా నకస్మాతుగాఁ బడినది. శ్రీ సప్తమ యెడ్వర్డు చక్రవర్తిగారి కింతత్వరలో మరణము మూగించుకొని వచ్చునని తలంపమైతిమి. నా కా దుఃఖము దుస్సహాముగా నున్నది. అయినను సామ్రాజ్యమంతయు సానుభూతిని జూపుచున్నదను నొక్క విషయము నన్నాశకలవానినిగాఁ జేసి దుఃఖమునుపశమింపఁ జేయుచున్నది. నాతోపాటు సామ్రాజ్యములోని యావత్తు ప్రజలును గొంతకాలము వఱకు దుఃఖ సముద్రములో మునిగి యుందురని భావించుచుంటిని.

"నేను ప్రేమాస్పదుఁడును, బూజ్యుఁడునగు తండ్రినే గాక నిత్యము సన్నిహిత సంబంధము గల మిత్రుని, హితాభిలాషిని గూడఁ గోలుపోయితిని

"విచార సముద్రములో మునిఁగియున్న నా తల్లియెడలఁగూడ మీరును, సామ్రాజ్య వాసులును ప్రేమతోఁ గూడిన సానుభూతినిజూపించెదరని విశ్వసించుచుంటిని.

"నేను నిల్చిన యీస్థానమందు నిలిచి తొమ్మిది వత్సరములకుఁ బూర్వము "జూపిరియున్నంతకాలము నేను నా సర్వ

జనుల యోగక్షేమముల కొఱకును, ప్రాణమును ధారవోయు చుందును" అని ప్రేమపాత్రులగు శ్రీ మాజనకులు చెప్పి యుండిరి. వారా వాక్యములను సంపూర్తిగా నాచరణములో నుంచిరని దేశీయులెల్లరు నంగీకరింతురని భావించుచుంటిని.

"ఆయన యడుగులో నడుగు వేయుచు నట్లు చేయుటతోఁ గూడ శాసన బద్ధమగు ప్రభుత్వమును నా భూములలోఁ గొనసాగించు చుండుటయే నా జీవితము యొక్క పరమావధిగా నెంచి దానిని నిర్వహింపఁ బ్రయత్నించెదను.

"నామీఁద నెట్టి బాధ్యతలు పడినవో నేను చాల శ్రద్ధతో గమనించియే యుంటిని.

"నాయీ విధులను నిర్వహించు చుండుటలోఁ బార్లమెంటు వారును, బ్రిటిషు దేశీయులును, గాలనీలవారును, సామ్రాజ్యము లోని యితరులును నిరంతరము నాకుఁ దోడ్పడు చుందురనియు, వివేచనముతోడను, జాగ్రత్తతోను గార్యములను నిర్వహించు చుండు శక్తిని నాకిమ్మని పరమ పితను మీరు ప్రార్థించు చుందురనియు నేను విశ్వసించు చున్నాను.

"నా ధర్మపత్ని నిత్యము నేను చేయుచుండు ధర్మనిర్వహణములందుఁ దోడ్పడిప్రజలకు నేను మేలుచేయునట్లు ప్రోత్స

హించు చుండుటను విశ్వాసము నాకుఁ బ్రోత్సాహమును గలిగించుచున్నది”

క్రీ. శ. 1910 వ సంవత్సరము మేనెల పదియవ తేదీనాఁడు బ్రిటిషు దీవులందును, ఐర్లాండు నందును బంచమ జార్జి రాజయ్యె నన్నవార్తను గ్రామగ్రామ మందును బ్రకటించిరి. నాఁడే నౌకాదళములు“బ్రిటిషుజాతి” నిర్మాణమున కెంత లోఁగడఁ దోడ్పడినదియుఁ దనకు ముప్పదియైదు వత్సరములు నౌకాదళ శాఖతో నెట్టి సంబంధమున్నదియుఁ నెఱిఁగించుచు బ్రిటిషు సామ్రాజ్యరక్షణము కొఱకును, బూర్వము నుండియు వచ్చుచున్న గొప్పతనమును నిలుపుట కొఱకును బ్రాణములను ద్యాగము చేయుటకు సిద్ధముగా నుండుఁడని హెచ్చరించెను. మఱియు నానాఁడే నిఖిలసైన్యములకును నీక్రిందివార్త నంపెను.

మారల్ బరోగృహము

1910 వ సంవత్సరము మేనెల 9వ తేదీ.

“నా ప్రియజనకుఁడు సైన్యములతో నిత్యము సన్నిహిత సంబంధము కల్గియుండెడివాఁడు. రాజ్యభారము వహించిననాఁటినుండియు సైన్యముల మేలే తనమేలుగా నాయనగారు భావించుచుండెడి వారు.

"నాకును జిన్నప్పటినుండియు సైన్యముల విషయములో నభిరుచి యున్నను గొలఁది కాలము నుండియు జాల నెక్కుడుగా హిందూదేశములోను సామ్రాజ్యము నందలి యితర భాగములందును గల సైన్యముం గూర్చి విశేషమగు శ్రద్ధను నేను దీసికొను చుంటిని.

"మీ యభి మతములను, మీ నేర్పరి తనమును దెలిసికొనుట కిప్పటి కంటె నెక్కుడు గా శ్రద్ధను వహించుచుందును. మఱియు మీరు సంపూర్ణముగా విశ్వసింపఁ దగిన వారనియు విశేషమగు రాజభక్తి కలవారనియు, మీకు విధించిన కార్యము లెట్టివియైనను వానిని జాగ్రతతోను, సంతోషముతోను నిర్వహించి యుద్ధము లందు జయము గాంచి "సూర్యుఁడస్తమింపని సామ్రాజ్య"మను పేరుగాంచిన మన యీ బ్రిటిషు సామ్రాజ్యపు గౌరవమును నిలువఁ బెట్టఁ గల యోధులనియు విశ్వసించు చుంటిని.

ఇట్లు,
పంచమ జార్జి
రాజును, జక్రవర్తియు.

# పదునెనిమిదవ ప్రకరణము.



## పట్టాభిషేకము.

1911 వ సంవత్సరము జూను నెల 12వ తేదీనాఁడు జార్జి సార్వభౌముని పట్టాభిషేకము, లండనులో జరుగునట్లు నిర్ణయింపఁబడెను. దురదృష్టవశమున నాఁడు వర్షముకురియుచుండుట చేతను, జలి హెచ్చుగానుండుట చేతను జూడవచ్చిన వారికి సంతాపకరముగా నుండెను. అయినను, లండను పట్టణవీధులందు లక్షలకొలఁది ప్రజలు రాజుగారి యూరేగింపు వచ్చుటకుఁ జాలపూర్వమేవచ్చి కనిపెట్టుకొని కూర్చుండిరి. పల్లెటూళ్ళనుండి కూడ నసంఖ్యాకులగు జనులు వచ్చి చాలఁ బెందలకడనే బాగుగాఁ గనఁబడు స్థానముల యందధిష్ఠించియుండిరి. కొంచె మించుమించుగాఁ బట్టాభిషేకమునకు ముప్పది లక్షలమంది వచ్చెదరని తలఁపఁబడి యందులకుఁ దగిన యేర్పాట్లు కావించిరి. కాని, వర్షము చేతను జలి చేతను దక్కువ మంది వచ్చిరి. అరువది వేలమంది సైనికు లూరేగింపు వెళ్లు వీధులలోఁ గావలి యుండి ప్రజల కొత్తిడి లేకుండఁ జూచుచుండిరి. వీరుగాక పంౘ్రెండు వేలమంది పోలీసు భటులు కూడ వీధులు కాపాడు చుండిరి.

# శ్రీ సార్వభౌమ దంపతులు.



శ్రీ పంచమ జార్జిచక్రర్తి



శ్రీ మేరీ రాజ్ఞి

ఉదయము 9 గంటల 30 నిముసములకు సరిగా బక్కింగ్ హాము రాజ భవనమునుండి యూరేగింపు వెడలి వచ్చెను. వారిలో రాజ బంధువులును, విదేశ రాజ ప్రతినిధులును గలరు. జర్మనీ, అమెరికా సంయుక్త రాష్ట్ర, ఫ్రాన్సు రాష్ట్ర ప్రతి నిధులకుఁ బ్రజలు బ్రహ్మాండములగు నుత్సాహముతో స్వాగతము సలిపిరి.

తరువాత రాజకుటుంబము వచ్చెను. అందు రాజు గారి సోదరీ మణులును, వారి పరిజనము నుండిరి. తరువాత రాజదంపతుల కుమారులుండిరి. 10 గం. 30 ని.లకు రాజభవనములో నుండి రాజ దంపతులు ప్రభుత్వ శకటము నధిష్ఠించి వచ్చిరి. వారు వెళ్ళినప్పుడు సర్వత్ర ప్రజలు చప్పట్లు చఱచి సంతసమును దెలుపుచుండిరి.

"వెస్టు మినిస్టరు ఆబే" అనుచర్చి భవనమునకు వెళ్ళునప్పటికి దేశములోని ప్రముఖు లెనిమిదివేల మంది రాజుగారి కొఱకెదురు చూచుచుండిరి. అందు రాజ వంశ్యులు, జమీందార్లు, ప్రభువులు, న్యాయాధిపతులు, మతాధికారులు, క్రైస్తవ మత ప్రతినిధులు, విశ్వవిద్యాలయ ప్రతినిధులు, గొప్ప గొప్ప విద్వాంసులు, కవులు, ధనవంతులు మొదలగు వారుండిరి.

అంతఁ జక్రవర్తి గారి యూరేగింపు వచ్చెను. తొలుత, మహా మాత్యుఁడు లోపలకు వచ్చెను. తరువాత,

యార్కు మతాధికారియు, రాజకోశాధికారియు, "కాంటర్బరీ మతాధ్యక్షుఁడును వచ్చిరి. ఆ పిమ్మట, రాజ్ఞి తన దుస్తులను మోయు నాలుగురు పేరంటాండ్రతోడను, మఱి కొందఱు నెచ్చెలులతోడను వచ్చెను.

ఆ పైని రాజు తన దుస్తులను మోయు కొందఱు బాలురతోడఁ బట్టాభిషేక వేదిక కడకువచ్చెను. వారివెంట నౌకాశాఖాధికారులును, సైన్యశాఖాధికారులు నుండిరి. అంతటితో లోనికి రాకుండ నితరులాపివేయఁబడిరి.

జాతీయగీతమును బాడుచుండ సార్వభౌమ దంపతులు ప్రభుత్వాసనముల కడ కేగిరి. కాంటర్బరీ మతాధ్యక్షుఁడు రాజును సభ్యుల కెఱిఁగించెను.

"దేవుఁడు రాజును రక్షించునుగాక" అనిపలికి ప్రజలు రాజు నాశీర్వదించిరి. అంత, రాజుగారు ప్రమాణముచేసిరి. తరువాత, నెత్తిపైఁ దైలము చరుమఁబడెను. ప్రభుత్వపు దుస్తులుతీసి రాజుగారు పట్టాభిషేకపుఁ గుర్చీమీఁద గూరుచుండిరి.

అప్పుడు కూప్రప్రభువును, రాస్ బరీప్రభువును, కడోగన్ ప్రభువును, మింటోప్రభువును రాజుగారి శిరముపైఁ దెరపట్టిరి. మతాధి కారి రాజుగారి శిరస్సునందును, ఱొమ్మునందును, చేతులందును, దైలమును రాసెను. పిమ్మటఁ, బట్టాభి

షేకపు టుంగరము రాజుగారి వ్రేలనుంపఁబడెను. తరువాత నధికారమును, ధర్మరక్షణమును దెలియఁజేయు రాజదండములు శ్రీవారి హస్తములం దుంపఁబడెను. అవి క్రైస్తవమతచిహ్నమగు "క్రాసు" బింబముచే నొప్పుచుండెను. తరువాత సమత్వమును, దయనుసూచించు నంగీని శ్రీవారు ధరించిరి. అప్పుడు కాంటర్బరీ మతాధ్యక్షుఁడు "దేవుఁడు శ్రీ సార్వభౌముని దేజోవంతునిగను, సత్యవంతునిగను జేయును గావుత" మని తాను ప్రార్థించుచుఁ గిరీటమును శ్రీ సార్వభౌముని శిరస్సునందుంచెను.

ఆకాశము చిల్లులు పడునట్లు వివిధ మంగళ వాద్యములు మ్రోగెను. ఆచర్చి భవన మంతయు "దేవుఁడు రాజును రక్షించునుగాక" అను నాశీర్వాదములతో నిండి పోయెను. అది క్రమముగాఁ బట్టణ మెల్లను వ్యాపించి యరువది లక్షల జనముగల లండను నగర మందెల్లెడలను "దేవుడు రాజును రక్షించునుగాక" యని మాఱుపలికిరి.

పట్టాభిషేక మైనదని తెలుపుటకు బురుజులనుండి ఫిరంగులు కాల్పఁబడెను. దైవాశీర్వాదమును గోరుపాటలు పాడఁబడెను. రాజు సింహాసనము నధిష్ఠించి మతాధికారియు, వేల్సురాకుమారునియు దేశము నందలి యితర ప్రభువులయు, రాణులయు నభివాదనములు స్వీకరించెను.

పిమ్మట, రాజ్ఞియు, రాజును మాత్రమే యీశ్వర ప్రార్థనముచేసిరి. నాఁడు రెండుగంటలకుఁ బట్టాభిషేకముముగిసెను.

---

# పందొమ్మిదవ ప్రకరణము.



## ఢిల్లీ దర్బారు.

హిందూదేశ చరిత్రము నందును, బ్రిటిషు రాజుల యాచారము నందును నూతనమగు నొక క్రొత్త యాచారమును హార్డింజ ప్రభువు హిందూ దేశము లోనికిఁ దెచ్చెను.

1858 వ సంవత్సరములో సిపాయిల కలహమునకుఁ బిమ్మట విక్టోరియా మహారాజ్ఞి యీస్టిండియా కంపెనీవారి నుండి పరిపాలనమును గ్రైకొనెను. అప్పుడే మొదటిసారివారు హిందూదేశమునకుఁ జక్రవర్తినిగాఁ బ్రకటింపఁ బడిరి. కాని, యామెకు దర్బారుత్సవము హిందూ దేశములో జరుగలేదు. 1902 వ సంవత్సరములో నెడ్వర్డు పట్టాభిషేకము జరిగెను. కాని, యతఁడుకూడ నిండియాకు వచ్చి దర్బారుత్సవము కావించుకొనలేదు. బ్రిటిషురాజు లండనులోఁ బట్టాభిషేకము కావించుకొనిన వెనుకఁ గాలనీలకుఁగాని యితరస్థలములకుఁ గాని వెళ్లి దేశీయులకుఁ గనులపండువుగా దర్బారుత్సవము నెఱపుకొనుట కిదియే మొదటిసారి.

డిసెంబరు 7వ తేదీని జార్జిరాజదంపతులు ఢిల్లీకిఁ జేరిరి. రైలుస్టేషనులో హిందూదేశపు రాజప్రతినిధి శ్రీ వారికి

స్వాగతమిచ్చి పట్టాభిషేకపు గుడారముల కడకుఁదెచ్చిరి. అక్కడ స్వదేశ సంస్థానాధీశ్వరులు శ్రీసార్వభౌమ దంపతులకొఱకు వేఁచియుండి రాఁగనే వారికభివాదనములు చేసిరి.

నూతన ఢిల్లీనగరమునందు శ్రీసార్వభౌముని పట్టాభిషేక శిబిరములు సుమారిరువదియైదు చదరపుమైళ్లు వ్యాపించియుండెను. పట్టాభిషేకమునకుఁ బూర్వము 12 మాసముల నుండి యాస్థలమునందు రాజశిబిరములు నిర్మించుటకుఁదగిన యేర్పాట్లు చేయుచుండిరి. అంతకుఁ బూర్వము నీటిచుక్కలేని యాస్థలములో నంతటను నీటిపంపులేర్పఱచిరి. అన్ని ప్రాంతములకుఁ జక్కని రోడ్లనేర్పఱచి యేప్రాంతమునఁ జూచినను గండ్లకింపుగానుండు పచ్చికపఱుపులను రోడ్లవెంటఁ బెంచి జక్కగాఁ గత్తిరించిరి. మఱియు నానాశిబిరముల పట్టణమునందుఁ బెక్కుచోట్లఁ గన్నులకుఁ బంధువుగా నుండు వింతవింత రంగుల పూమొక్కల పఱుపులను, పచ్చిక పఱుపులను బెంచిరి. ఆపూల వింతవింత సోయగములు పచ్చిక పఱుపులతోఁ జెలిమి నెఱపి హిమాలయోన్నత భూములందలి పరమేశ్వరుని గృహారామమును దలఁపునకుఁ దెచ్చుచుండెను. హెచ్చుతగ్గులుగాను, ఱాలతోడను, జిల్లపెంకులతోడను నుండు నాప్రదేశమిప్పుడు చక్కగాఁదీర్చి కట్టిన మహానగరములోని బాటలవలె కనులకింపుగానుండెను. అందు స్వదేశ సంస్థానా

ధీశ్వరులకు వేఱువేఱుగా నైదాఱుమైళ్ళ ప్రదేశములో బస లేర్పాటు చేయఁబడెను. సైన్యాధి పతులకు, రాష్ట్రపాలకులకు వేఱు వేఱుగా గుడారములు వేయఁబడెను. మండలోద్యోగులకు, ప్రభుత్వోన్నతోద్యోగులకు, ద్రష్టలకు వేఱు వేఱు స్థలములలో బసలు కల్పింపఁబడెను. ఇరువది యైదు చదరపుమైళ్ళ ప్రదేశములో నెచటఁ జూచినను దెల్లగాఁ జక్కగా వెండివలెఁ బ్రకాశించుచు నా శిబిరములు వెలసెను. ఎచ్చటఁ జూచినను మంచినీరు వసతులే. అప్లై యారోగ్య శాఖవారన్ని గుజిలీ స్థలములందును బ్రజలు కాల కృత్యములు తీర్చుకొనుటకుఁ దగిన మఱుఁగు దొడ్ల నేర్పఱిచి యెప్పటి మాలిన్యము నప్పుడు దూరముగాఁ గొంపోవుటకు మోటారు బండ్ల నుంచుటచే నా శిబిరములందెందును దుర్గంధముకాని, మాలిన్యముకాని లేక యాపట్టణము స్వర్గలోకములో నివసించు విలాసవంతులగు యక్షకుమారుల నగర మోయను నట్లానందదాయకమై, మనోహరమై, దానిని సృష్టింపఁజేసిన హార్డింజి ప్రభువరుని విశాల హృదయమును, నిర్మాణ కౌశలమునుజెప్పక చెప్పుచుండెను.

డిసెంబరు 12 వ తేదీవచ్చెను. దర్బారు జరుగు గొప్పశిబిరము శ్రీ సార్వభౌముని మకామునకు సుమారు మూఁడు మైళ్ళదూరములో నుండెను. లోపలి షామియానాలో

విశాలముగా రాజకీవితోఁ బదివేల మంది కూర్చుండి చూచుట కు వీలగు నట్లాశిబిర మేర్పాటు చేయఁబడెను. షామియానాకు వెలుపల మఱి యిరువది వేల మంది గ్యాలరీలలోఁ గూర్చుండి చూచుటకు వీలుండెను. అందిరువది వేల మంది యాంగ్ల సైనికులు కాపుండిరి. వెలుపల నేఁబది వేలమంది హైందవ సైనికులుండిరి.

స్వర్గలోకమునుండి డిగివచ్చి తన లోకోత్తరమగు దర్బారును భూలోకము నందిందు్రఁడు జరుపుచుండెనో యను నట్లాదర్బారు చతుర్ముఖునికేని వర్ణింపరాని వైభవముతో నొప్పుచుండెను. దేహములనిండుగా రత్నఖచిత సువర్ణాభరణ పరంపరలు ధరించిన స్వదేశ సంస్థానాధీశ్వరులు సార్వభౌమదంపతుల సమక్షమునఁ గూరుచుండిరి. వారు ధరించిన చీని చీనాంబరములు కెంజాయలను, శుభ్రకాంతులను, బంగరు ఛాయలను, నాకుపచ్చని రంగులను, నల్లని రంగులను, మిశ్రములగు రంగులను వెదఁజల్లుచుఁ జూపఱ కన్నులకు నీటుగొలుపుచు వారికంఠములందు వెలుంగుచున్న రత్నహారముల కాంతులతో నెకసక్కెసము లాడుచుండెను. ఇట్లా పట్టాభిషేక మందిరము రాజసూయయాగ నిర్వాహణ సమయమున ధర్మరాజునకు సమర్పించిన మయు సభయుం బోలె మణి మయాలంకార శోభితమై వివిధ రాష్ట్రి

సమాగత రాజశేఖరాలంకృతమై వైభమునందిందున్ని పేరో లగంబును ధిక్కరించుచు వర్ణనాతీతమై సౌందర్యరాసులు కురియుచుండెను.

స్వామియా నాలోఁగల పదివేల మందిద్రష్టలలో దేశములోని గవర్నరులు, సైనికాధికారులు, రాజులు, నవాబులు, రాష్ట్రముల మంత్రులు, న్యాయాధిపతులు, రాజకీయవేత్తలు, పత్రికాధిపతులు మొదలగు వారుండిరి.

సార్వభౌమ దంపతులు రత్నఖచిత సింహాసనమెక్కి నైజాము, గైక్వారు, మైసూరు, కాష్మీరు సంస్థానాధీశ్వరుల నుండి యభివాదనములను స్వీకరించిరి.

పిదప నొకరి తరువాతి నొకరుగా శతాధికులగు సంస్థానాధీశ్వరు లభివాదనములు చేయుచుండ నా వచ్చుచుఁ, బోవు చున్న సంస్థానాధీశ్వరుల గౌరవార్థము 21 చొప్పున, 19 చొప్పున, 17 చొప్పున నెవరి కెన్ని ఫిరంగులు పేల్చుటా చారమో యట్లిరువదియొక్కటికి మించకుండ పేల్చుచున్న ఫిరంగుల మోతఁ తలచే నాకసము చిల్లులుపడుచుండెను. పిమ్మట, నా యభివాదన స్వీకరణముల ముగింపును వాద్యములచే వ్యక్తము చేసిరి. ఆవెనుక శ్రీ రాజ చక్రవర్తిగారు హిందూదేశ పరిపాలనములో నీక్రింది మార్పులు కావించితిమని చెప్పిరి

(1) హిందూదేశపు రాజధాని కలకత్తానుండి ఢిల్లీకి మార్పఁబడినది.

(2) వంగదేశము క్రొత్తగా గవర్నరు రాజధానిగాఁ జేయబడినది.

(3) బీహారు, చోటా నాగపూరు, "ఒరిస్సా"లు మూఁడును వేఱుగా నొక లెఫ్టినెంటు గవర్నరుక్రింద నుండు రాష్ట్రముగాఁ జేయఁబడినది.

ఇట్లు కర్జనుప్రభుపు వంగదేశమును విభజించి హిందూదేశీయులకుఁ గల్గించిన తీరనిదుఃఖమును శ్రీ సార్వభౌముఁడు తొలఁగించి హిందూదేశమునకు సంతోషమును గూర్చెను. అంతేగాక చరిత్ర ప్రసిద్ధమగు ఢిల్లీనగరమును హిందూదేశమునకుఁ బ్రధాన నగరముగాఁ జేసి భారతీయులకుఁ జాల నానందమును గలిగించెను.

దర్బారు జరిగిన మఱునాఁడు జైను, హిందూ, మహమ్మదీయ సిక్కుమతముల పురోహితు లాయామతముల కనుగుణములగు మత విధులతో నీశ్వర ప్రార్థనములు సలిపి, శ్రీ సార్వభౌమునకుఁ జిరాయువు గల్గునట్టు లనుగ్రహింపుమని యీశ్వరుని బ్రార్థించిరి. మఱియు నా పండితులు బ్రిటిషు సామ్రాజ్యము వచ్చుటచేఁ గలిగిన మేళ్ళను గొనియాడి, హిందూ దేశములో బ్రిటిషు సార్వభౌముల పరి

పాలన మెట్లు శాంతిని నెలకొల్పినదియుఁ బ్రజల కెఱిఁగించి, జార్జి చక్రవర్తికిఁ జిరాయువు కల్గునట్లాశీర్వదించిరి. ఆమతాధికారుల ప్రార్థనముల నుద్యోగులును, సైనికులును, మఱిమత విశ్వాసము గల జన సమూహములును వచ్చి సంతసముతో వీక్షించిరి.

మఱునాఁడు గొప్పపండుగ చేయఁబడినది. అది ప్రజల దినము. నాఁడు గుఱ్ఱపుఁబందెములు, కోయలు మొదలగు నడవిజాతులవారి నాట్యములు, పాములవాండ్రు, గారడీవాండ్రు, మొదలగువారి వినోదములు, బుడబుక్కలవాండ్రు తమాషాలు మొదలగు దేశీయుల వినోదపుజట్టులు యమునా నదికిని షాజహానుప్రాంత కోటలోని ప్రాసాదము నకును మధ్యభూములందెల్ల జరుపఁగా లక్షలకొలఁది ప్రజలా తమాషాలు వినోదముగాఁ జూచిరి. శాంతులుగా నుండునట్లు తయారుచేయఁబడిన పంజాబు పోలీసు దళములు గల్లంతులు లేకుండ కాపాడి యాజనసమూహములను క్రమములోనుంచిరి.

ఒక యున్నతస్థలమునందుఁ గూరుచుండి శ్రీ రాజదంపతులా వినోదముల నెల్ల వీక్షించుచుండిరి. వారు రాజోచితములై, మనోహరములగు దుస్తులుతాల్చి, కిరీటములుధరించి చూచువారికి భూలోకములోని వినోదములు చూడవచ్చిన యింద్రశచీదేవులుంబోలె ధగద్ధగాయమాన భూషణ

విభ్రాజితులును మందహాసాంకురాలంకృత ముఖారవిందులునై యావినోదములం జూడనెంచిన వారికెల్లరకు స్పష్టముగా గోచరించు మేరలోనుండిరి.

డిసెంబరు 14 వ తేదీనాఁడు శ్రీ చక్రవర్తిగారాశ్వికబలములయుఁ, గాల్బలములయు సైన్య పాటవంబుందిలకించిరి. బ్రిటిషుదేశ సమాగతోత్తమాశ్వముల నధిష్ఠించి కొందఱును, భారతీయోత్తమహాయంబుల నెక్కి వేఱొక కొందఱును, తమ తమ తురంగముల వేగ పటుత్వములను, దమ తమ హయశిక్షణ కౌశలములను, యుద్ధ కళా నైపుణ్యములను శ్రీ సార్వభౌమ దంపతులకుఁబ్రదర్శింప నెంచి సుమారు నలువది వేల తెల్లని, నల్లని యుత్తమాశ్వికులు తమకుఁ దమకు సహజములగు జట్టులుగాఁ గూడి; యాకసమునంమఁ దేజరిల్లుచుండు సూర్య కిరణముల ప్రకాశ పరంపరల నధఃకరించుచున్న దీర్ఘ ఖడ్గంబులు పైకిఁజాఁచి; గగనంబునందందంమఁ దాండవమాడుచుండు భూతప్రేత పిశాచ ఢాకినీత్యాది దుష్ట సంతాప కారకంబుగను, యక్ష, సిద్ధ, సాధ్య, ఖేచరాది శిష్టస్తుతి యోగ్యంబుగను, వివిధ దేశ సమాగతదర్శనోత్సాహి జనసమూహంబులకుఁ గన్నులు మిఱుమిట్లుగొల్పి "హైందవ సామ్రాజ్య బలంబులు దేవతలకు, దానవులకుఁగూడ నభేద్యంబు"లను భావంబు గూర్చుచుండ

శ్రీవారి సమక్షమునందుఁ దమతమ శక్తిసామర్థ్యంబులఁ బ్రదర్శింప, నిర్జరయుద్ధ కళాపరిశీలనోత్సాహులగు పురందర దంపతు లట్లు శ్రీ సార్వభౌమ దంపతులు వారలం బరీక్షించుచుఁజూచు వారల మనఃఫలకములందు వీరాద్భుత భయానక రసంబులు కురియుచుండిరి.

పిదప, శ్రీ సార్వభౌముఁడు భారత భూమియందర్హులగు స్త్రీపురుషులకెల్ల బిరుదంబులొసంగి సత్కరించె. అందు "హిందూదేశ నక్షత్ర"మను మొదటి బిరుదము శ్రీ సార్వభౌముఁడుతన ధర్మపత్నియగు మేరీ రాజ్ఞికొసంగె. పిమ్మట నొకరి తర్వాత నొకరుగా రాజప్రతినిధియు, సర్వసైన్యాధ్యక్షులు, హైందవ సామ్రాజ్య మంత్రులు, స్వదేశ సంస్థానాధిపులు మొదలగువారు శ్రీ సార్వభౌముని నుండి బిరుదములు స్వీకరించిరి.

పిమ్మట, నైదువేల వత్సరముల కంటె హెచ్చు కాలమునుండి భారత భూమికి రాజధానిగా నున్న ఢిల్లీ పట్టణమునందు, నూతన రాజప్రతినిధి భవనము, సామ్రాజ్య శాసనసభా భవనము మొదలగు ననేక భవనములతోఁ గూడిన నూతననగరనిర్మాణమునకు శ్రీ సార్వభౌమ దంపతులు పునాది రాయి వేసిరి.

తరువాత, నన్యదుర్లభమగునట్టి దర్బారును విడుచు చుంటిమికదాయను విచారముతో శ్రీ సార్వభౌమ దంపతులు, స్వదేశ సంస్థానాధీశుల దుఃఖసూచకాభివాదనపరంపరలు మఱియొకసారి స్వీకరించి, ఢిల్లీదర్బారువిడిచి, హిందూదేశము లోని కొన్ని పట్టణములు సందర్శించి, 8 వ జనవరినాఁడు కలకత్తానుండి సరాసరి బొంబాయికేగి తమ గౌరవచిహ్నముగాఁ బేల్చుచున్న 101 ఫిరంగుల మ్రోఁత గగన తలమును బ్రద్దలుచేయుచుండ నాంగ్లభూమి కేగిరి.



# ఇరువదవ ప్రకరణము.



## శ్రీ సార్వభౌముని ప్రజారంజకత్వము

పువ్వుపుట్టఁగనే పరిమళించుననునొక సామెతకలదు. జార్జిసార్వభౌముఁడు పట్టాభిషేకము జరిగిన వత్సరముననే సార్వభౌముని సత్యపరత్వమును, రాజకీయప్రౌఢిమను బరీక్ష సేయు నొక సందిగ్ధావస్థ యెదుర్కొనెను.

ఇంగ్లండు యొక్క సర్వ వ్యవహారములను దుదిబరిష్కారము చేసి యాదేశముయొక్క భవితవ్యమును శాసింపఁగల సంస్థలు రెండుకలవు. వానినే "హౌస్ ఆఫ్ లార్డుసు" అనఁగాఁ బ్రభువులసభ యనియు "హౌస్ ఆఫ్ కామన్సు" అనఁగాఁ బ్రజల సభయనియు నందురు. ఆరెంటిలో నిజమునకు సర్వములగు నధికారములును గలది "ప్రజల సభయే". కాని, ప్రజల సభలో నొక్కొక్కప్పుడు జరుగు తొందరపాట్లను సవరించుటకొక సలహా సంఘముగా "ప్రభువుల సభ" నుంచుటకుఁ బ్రజలంగీకరించిరి.

అయినను, స్పష్టముగా నీరెండు సభల ప్రత్యేకపు హక్కులను నిర్వచించు శాసనము లేదు. ఆచారమును బట్టియు, "ననుశ్రుతి"ని బట్టియు సాధ్యమైనంత వఱకు

సంఘర్షణములు లేకుండ నా రెండు సభలును రాజకార్యము లను జయప్రదముగా వందల కొలఁది సంవత్సరముల నుండియు నిర్వహించుచుండెను.

కాని, యనేకములగు చిక్కులు వచ్చెను. ప్రజాప్రతినిధి సభకెట్టి హక్కులుండ వలయునో, ప్రభువుల సభకెట్టి హక్కు లుండవలయునో స్పష్టముగా ధర్మశాస్త్రమునందు నిర్వచింప వలసిన తరుణము వచ్చెను.

1909 వ సంవత్సరమునందు లాయిడు జార్జిగారి యార్థిక చట్టమును ప్రభువుల సభ వారంగీకరింపక యోడించి నప్పటి నుండియు నీ సమస్య చాల క్లిష్టస్థితికి వచ్చినది.

దేశమెల్ల గౌరవించిన మహా మేధావియగు గ్లాడుస్టను గారు మొదట నింతకు 17 సంవత్సరములకుఁ బూర్వమే రెండు సభల ప్రత్యేకపు హక్కులను సందిగ్ధము లేకుండ శాసన రూపముగా నిర్వచింప వలయునని చెప్పిరి. కాని, యా పని యప్పటి నుండియు జరుగలేదు.

ఆస్క్విత్తు మహామంత్రి నేఁడు ప్రభువుల సభవారి యీ నిరంకుశాధికారమును దగ్గింప నెంచెను. అందుచే నతఁడు "పార్లమెంటుబిల్లు" అను నొక చట్టమును దయారుచేసి

ప్రజాప్రతినిధి సభవారి యెదుట నుంచెను. "ఏచట్టము నయినను రెండు సంవత్సరములలో మూఁడుసార్లు ప్రజా ప్రతినిధి సభ వారంగీకరించినచో దానికిఁ బ్రభువులసభ వారి నిరాకరణముతో సంబంధము లేకుండ రాజుగారంగీకరించి శాసనముగాఁ జేసితీరవలయును" అని యందుస్పష్టముగాఁ జెప్పబడియుండెను. ఈ బిల్లు గెల్చినయెడలఁ బ్రభువుల సభ వారి నిరంకుశాధికార మంతరించును.

ఆ చట్టమును బ్రజా ప్రతినిధి సభవారంగీకరించిరి. కాని, దానిని బ్రభువుల సభవారు తిరస్కరించుటయే గాక పూర్వము నుండియు వచ్చుచున్న తమ హక్కుల నది త్రుంచి వేయుచున్నదను హేతువుచే నందలి ప్రభువులు ప్రధానామాత్యునిఁ గసిదీరఁ దిట్టిరి. అతఁడు బదులు తిట్టకయే కోట్లకొలఁది ప్రజ లెన్నుకొనిన ప్రతినిధుల హక్కులను మూఁడు నాల్గువందల మంది కలిసి తిరస్కరించి త్రోసివేయుట బ్రిటిషు రాజ్యాంగ సూత్రములకు విరుద్ధమని ఘంటాపథముగాఁ బలికెను. కాని, వారు వినరైరి.

ఈ బిల్లును నెగ్గింప వలయు నన్నచో రాజుగారి సాయము కావలయును. అదియెట్లనఁగా: అప్పటికి బ్రభువుల సభలో నెంతమంది కలరో యంతమందికంటెఁ గొలఁది మంది హెచ్చుగా నుండునట్లు ప్రజల

కనుగుణముగా సమ్మతుల నిచ్చువారికిఁ బ్రభు బిరుదము లొసంగి, వారిని శ్రీ సార్వభౌముఁడు ప్రభువులుగాఁ జేయవలయును. అప్పుడు వారు ప్రభువుల సభ కేగి యాచట్టము నంగీకరింతురు. అట్లు ప్రజలకుఁ బ్రభు బిరుదము లిచ్చు హక్కు సార్వభౌమునికి మాత్రమే కలదు. ఆచట్టమును బ్రభువుల సభలో నంగీకరింపఁ జేయుటకుఁ దగినంత మందికి బిరుదము లిచ్చుటకు శ్రీ సప్తమ యెడ్వర్డు ప్రభువుగారు మహా మంత్రికి వాగ్దానము చేయలేదు. అందుచే నాచట్టము నప్పటి విధుల ప్రకారము రెండు సభలందు నంగీకరింపఁ జేయుటకు వీలులేకుండెను.

ఇంగ్లండు నందెల్ల గొప్ప యలజడి కలిగెను. అది గొప్ప వివాదాంశ మాయెను. రాజీ పడవలయునని లండనులో డౌనింగు వీధిలో 10 వ సంఖ్యగల మహామాత్యుని యింటి యందిరువది యొక్క సారు లుభయపక్షముల వారును గూడిరి. కాని, రాజీకుదరలేదు.

జార్జి రాజుగారు సింహాసన మెక్కిరి. ఆయన తండ్రిగారి కంటెఁ బ్రజలలో నెక్కుడుగాఁ దిరిగెను. ప్రజల యందెక్కుడు సానుభూతి యాయనకుఁ గలదు. ప్రజలలో దైవముండెనని యాయన విశ్వసించెను. అంతేగాక యతఁడు ప్రజా ప్రతినిధిసభయందును,

బ్రిభువుల సభయందును జరుగుచున్న కార్యక్రమములను నుపన్యాసములను శ్రద్ధగాఁ జదివెను. అతనికిఁ బ్రజల కోరిక యందు సత్యము కలదని బోధపడెను. సత్యమని విశ్వసించిన దానినతఁ డాచరించుటకు వెనుదీయఁడు. అందుచే నతఁడు ప్రజల తరఫున మహామంత్రి కోరిన విధముగా సుమారైదు వందల మందికి "ప్రభువు" బిరుదములనిచ్చి ప్రభువుల సభవారి నిరంకుశాధికారమును దొలఁగించు చట్టమును రెండు సభలలో గెలుచునట్లు చేయవలయునను భావము నందఁ జొచ్చెను.

అది తెలిసి ప్రభువులు జార్జిరాజుగారి వెంటఁబడిరి. ఆ దేశములో నున్న ప్రభువులందఱు నతనికి సన్నిహితులు. అందులోఁ బెక్కు మంది బంధువులు. అందుచే వారందఱు నేకీభవించి తమ పక్షమునకు శ్రీజార్జి సార్వభౌమునిఁ ద్రిప్పుకొనవలయునని విశ్వప్రయత్నములు చేసిరి. మఱియు వారా చట్టమును వేలకొలఁది వత్సరములనుండి యనుభవించుచున్న తమ హక్కులను నశింపఁ జేయుటకుఁ బ్రజలు ప్రారంభించిన ఘోరయుద్ధముగా భావించి ప్రధానామాత్యుని దూషించి చిరకాలము నుండి రాజును సేవించుచున్న తమ హక్కులను గాపాడ వలయునని శ్రీ జార్జి సార్వభౌముని గట్టిగాఁ బ్రార్థించిరి.

కాని, జార్జి సార్వభౌముఁడు సత్య తత్పరుఁడు. నాలు గైదు వందల ప్రభువుల యనర్హములగు హక్కులను గాపాడుటకంటె నాలుగుకోట్ల ప్రజల హక్కులను గాపాడుట యే న్యాయమని వారి యంతరాత్మ వారికి బోధించెను. అందుచే, వారు బంధువులును, సన్నిహితులు నగు ప్రభువుల మాటలు వినక యవసర మగునేని యయిదు వందల మందినిఁ గ్రొత్తగాఁ బ్రభువులనుగాఁ జేసి యా చట్టమును గెలిపింతు నని బ్రిటిషు దేశపుఁ బ్రధానామాత్యునికి వాగ్దానము చేసెను.

అది తెలియఁగనే ప్రభువులసభలోనే చాలమంది ప్రజల పక్షమునకుఁ దిరిగిరి. అందుచే మరల నాచట్టము ప్రభువుల సభలోనికి వచ్చినప్పు డే విధమగు మార్పులును లేకయే ప్రభువుల యంగీకార మందెను. మహా మంత్రియుఁ బ్రజల సభవారును బరమానంద భరితులైరి. ప్రజల కోరికలు నెఱవేరెను. సత్యము తరఫున నిలిచి ః గెలిపించి నందులకు బ్రిటిషు దీవులలోఁ గల నాల్గుకోట్ల ప్రజలును శ్రీ జార్జి సార్వభౌము నభినందించిరి.

---

# ఇరువదియొకటవ ప్రకరణము.



## శ్రీ జార్జి సార్వభౌముని యుద్ధసేవ.

తనకు సన్నిహిత బంధువగు కెయిజరు చక్రవర్తిని యుద్ధము విరమింపు మని జార్జిరాజు పెక్కు విధములఁ గోరెను. కాని, పదభ్రష్టుఁడు కానున్న యా రాజా హితమును వినఁడాయెను.

విధిలేక యింగ్లండు రెండు మాసము లాలస్యముగాఁ 1914 వ సంవత్సర మాగష్టు నెలలో యుద్ధము ప్రకటించెను.

యుద్ధ ప్రకటనా నంతరము యుద్ధ భూమికిఁ గుమారుని బంపి ఫ్రెంచి సర్వ సైన్యాధ్యక్షునికి సహాయకుఁడుఁగా నుండ వినియోగించెను.

పిమ్మట, దాను స్వయముగా యుద్ధ భూమికేగి యుద్ధరంగమును జూచి వచ్చెను. 1743 వ సంవత్సరములో రెండవజార్జి రాజునకుఁ బిమ్మట మఱియే యాంగ్ల భూపాలుఁడును యుద్ధభూమికి వెళ్ళలేదు.

యుద్ధములో దెబ్బలు తిన్నవారిని శ్రీ సార్వభౌమ దంపతులు బుజ్జగించి భక్ష్య పానీయాదు లొసంగి వారి కానందముంగూర్చిరి.

1915 వ సంవత్సరములో నౌకా యుద్ధస్థానములకును భూయుద్ధస్థానములకును శ్రీ జార్జి సార్వభౌముఁ డేగెను. పనివాండ్రు త్రాగి యుద్ధపరికరములు తయారుచేయు ఫ్యాక్టరీలలోఁ బనులా లస్యము చేయుచున్నారను వార్త నా సార్వభౌముఁడు వినుట తటస్థించెను. అందుచే నతఁడు వెంటనే తన రాజ భవనములందెక్కడఁ గాని, ద్రాక్షారసమును గాని, బీరును గాని యితర నిషావస్తువులనుగాని యుపయోగింప రాదని రాజాజ్ఞను బ్రకటించెను.

హిందువులవలెఁ ద్రాగుట పాపముగా గణింపని యీ దేశమునందు ద్రాక్షారసము, బీరు మొదలగు వస్తువుల నింటింట్లను మితముగాఁ బ్రతిదినమును ద్రావుచుందురు. అట్టి యాచారమును శ్రీ జార్జి సార్వభౌముఁడు విరమించుట చే నింగ్లండునందు యుద్ధకాలమునందు గొప్పమార్పు కలిగెను. శ్రీవారిననుకరించి మహాయోధుఁడగు కిచినరుప్రభువు త్రావుటమానెను. కొలఁదికాలములో నాయాచారము వెదకి పట్టుకొనుటకుఁ గూడ లేకుండ మాయ మాయెను.